27.10.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:41 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



## వైఎస్, కోట్ల కీచులాటతో కాంగ్రెస్ పీకకు ఉరి!

రాష్ట్ర కాంగ్రెస్‌కు పట్టిన శని ఇప్పట్లో వదిలేట్టు లేదు. అధికారంలో వున్నా, లేకున్నా "వెనుకటి గుణమేల మాను" అన్నట్లు కీచు లాడుకుంటూనే వున్నారు. రాష్ట్ర కాంగ్రెస్‌లో ప్రధానంగా కోట్ల వర్గం, నేదురుమల్లి వర్గం, డాక్టర్ రాజశేఖర రెడ్డి వర్గం ముక్కాలిపీట రాజకీయాల్ని నడుపు తున్నాయి. ఇందులో వై.ఎస్. వర్గీయులది ఒంటెద్దు పోకడ కాగా, ఉమ్మడి ప్రయోజనాల దృష్ట్యా కోట్ల, నేదురుమల్లి వర్గీయులు అప్పుడప్పుడూ కలిసి పని చేస్తుంటారు. నేదురుమల్లి జనార్దన రెడ్డికి, కోట్ల విజయ భాస్కర రెడ్డికి మధ్య సంబంధాలు అంతంత మాత్రంగానే వున్నా వై.ఎస్. రాజశేఖర రెడ్డి విషయాని కొచ్చేసరికి కోట్ల, నేదురుమల్లి ఒకే మాట, ఒకే బాటగా రాజకీయం నడుపు తున్నారు. వై.ఎస్. మునుపటి మాదిరిగానే రాష్ట్రంలో తన మార్కు రాజకీయం కోసం ప్రత్యర్థి వర్గాల పై విమర్శలు చేస్తూ పత్రికల కెక్కుతున్నారు. ఇటీవలి కేంద్ర మంత్రి

### శాపవిమోచనం వున్నట్లు లేదు!

వర్గ విస్తరణలో తనకు దక్కాల్సిన మంత్రి పదవికి కోట్ల, నేదురుమల్లి చివరి క్షణంలో గండి కొట్టారని వై.ఎస్. ధుమధుమ లాడుతున్నారు. మంత్రి వర్గ విస్తరణకు ముందు రోజు తన పేరు ప్రధాని జాబితాలో వుండిందని, అయితే కోట్ల వారు ప్రధాని పై తీవ్ర వత్తిడి తెచ్చి ఆ జాబితాలో ఆంధ్రప్రదేశ్ వాసన లేకుండా చేశారని వై.ఎస్. అంటున్నారు. అలాగే నేదురుమల్లి కూడా తన వంతు ఆజ్యం పోసి ప్రధానికి నూరి పోశాడన్నది వై.ఎస్. అనుమానం. అందుకే ఇటీవల తన వర్గీయుడైన డి.ఎల్. రవీంద్రా రెడ్డి ద్వారా పత్రికా ప్రకటన ఇప్పించి కోట్ల పై తిట్లు, శాపనార్థాలు కురిపించారు. లోక్‌సభ ఎన్నికలు సమీపిస్తుం డటంతో ఇక తనకు మంత్రి పదవి దక్కుతుందన్న ఆశ కూడా లేదని వై.ఎస్. నిప్పులు తొక్కుతున్నాడు. తనకు మంత్రి పదవి ఇవ్వకుండా ప్రధాని పి.వి. దగ్గర అడ్డు పడినందుకు

కొరవ 8 పేజీలో

## బొగ్గేటి వరద నీటిలో 24 నిండు ప్రాణాలు సజీవ జలసమాధి!

ఆత్మకూరు సమీపంలోని పాత బంగాల పల్లె వద్ద 26 తేది ఉదయం జరిగిన ఒక ప్రమాదంలో 24 మంది దుర్మరణం పాలైనారు. మనసును చలింప జేసే విషాద దుర్ఘటన ఇది.

ఆత్మకూరు మండలానికే చెందిన బండారు పల్లె నుంచి 32 మంది గ్రామస్తులు ఒక గూడ్స్ వ్యాన్‌లో ఆత్మకూరుకు బయల్దేరారు. పాత బంగాల పల్లెకు వచ్చేసరికి బొగ్గేరు ఉరవడితో ప్రవహి స్తుండింది. కాజ్‌వే పై అడుగు లోతు నీళ్లుండినాయి. ఈ వ్యాన్ అక్కడకు చేరే సరికి ఉదయం 8.30 ప్రాంత మైందట. అంతకు కొ[illegible] నిముషాల క్రితమే ఒక ప్రైవేటు బస్సు సురక్షితంగా వాగు దాటింది. ఆ ధైర్యంతో వ్యాను డ్రైవరూ కాజ్‌వే పైకి వ్యానును నడిపించాడు. అప్పటికీ నలుగురు ప్రయాణీకులు వ్యాన్ ముందు నడుస్తూ దారి చూపిస్తుండి న్నారట. కాజ్‌వే గుంటల మయం కావడంతో, ఆ నీళ్లలో వాటిని తప్పించ డానికి ప్రయత్నించ బోయి, స్టీరింగ్ అదుపు తప్పి, వ్యాన్

### ఘోరం!

కాజ్‌వే అంచుకు చేరుకొని బోల్తా కొట్టింది. క్షణాలలో వ్యాన్ నిండా నీళ్లు చేరిపోయాయి. నిలువు లోతు గుంటలో వ్యాన్ మునిగి పోయింది. దాని లోపలున్న ప్రయాణీకులు లోపలే

కొరవ 7 పేజీలో

# దీపావళి వెలుగూ షేర్ మార్కెట్ చీకటిని పారద్రోల లేకపోయింది!

దీపావళి వచ్చింది; పోయింది. షేర్ మార్కెట్ పై దాని ప్రభావం ఏ మాత్రం లేదు. అమావాస్య చీకట్లు తొలగలేదు. దీపావళి నాటికి బుల్స్ కేరింతలతో మార్కెట్ సందడిగా, సంతోషంగా వుండడం ఆనవాయితీ. కానీ ఈసారి దీనికి వ్యతిరేకంగా బేర్ మార్కెట్ వుండడంతో షేర్ల ధరలను మరింత కుంచి వేసింది.

షేర్ మార్కెట్‌కు, మార్వాడీ వ్యాపారస్తులకు దీపావళి చాలా పెద్ద ప్రాముఖ్యం కల్గిన పండుగ. దీపావళి ముందు రోజు వరకు ఆ ఏడాదిలో

డాక్టర్ ఎ.దుర్గాప్రసాద్

జరిగిన లావాదేవీలను పరిష్కరించి, లెక్కలు క్లోజ్ చేసి, కొత్త సంవత్సరానికి కొత్త అకౌంట్స్ తెరవడం వీరి అలవాటు. క్రీస్తు శకం, శాలివాహన శకం వలె వీరికి 'మూరత్' శకం వుంది. ప్రతి దీపావళిని ఒక నూతన సంవత్స రారంభంగా భావిస్తారు. అందువల్లనే సాధారణంగా దీపావళి నాటికి షేర్ల ధరలు బాగా పుంజుకొని వుంటాయి. కాని ఈసారి అటువంటి పరిణామాలేవీ జరగలేదు. అనలే సమస్యల మయంగా వుండిన మార్కెట్‌ను రిలయన్స్ షేర్ల వివాదం, ధీరూభాయి అంబానీ ఆరోగ్యం బాగా లేదన్న పుకార్లు, సూర్య గ్రహణం ప్రభావం వంటివి మరింత సంక్షోభం సృష్టించాయి. రిలయన్స్ షేరు ధర రు. 225 లకు దిగజారి పోయింది. బొంబాయి సబర్బన్ అండ్ ఎలక్ట్రికల్ సర్వీసెస్ ధర రు. 155 లకు పతనమైంది. ఈ వారంలో, ఆరు నెలల అర్ధ సంవత్సర ఫలితాలను ఎంతో ఆశావహంగా ప్రకటించిన నాగార్జున ఫర్టిలైజర్స్ ధర సైతం పడిపోయింది.

షేర్ మార్కెట్ ఇంక ఎప్పుడు, ఏ రీతిలో కోలుకొంటుందో ఆ పరమాత్ముడికే ఎరుక.

సంపూర్ణ సూర్యగ్రహణ పరమ అద్భుత ప్రకృతి విచిత్రం; గ్రహణ సమయంలో కళ్ళు మిరుమిట్లు గొల్పే రీతిలో సంభ్రమాశ్చర్యాలు కల్గిస్తున్న సూర్యకాంతి వజ్రపుటుంగరం. 24 తేది కలకత్తా సమీపంలోని డైమండ్ హార్బర్‌లో తీసిన ఛాయాచిత్రాలివి..

# ఎంకె సెక్యూరిటీస్ పబ్లిక్ ఇష్యూ దండగే!

హైదరాబాదు స్టాక్ ఎక్ఛేంజ్ బ్రోకర్ కార్డు కొనుగోలు చేసి, షేర్ల వ్యాపారం చేసే పుద్దేశ్యంతో ఈ వారంలో మూడు కంపెనీలు పబ్లిక్ ఇష్యూకి రాబోతున్నాయి. ఎం.కె. సెక్యూరిటీస్, జెనెసిస్ సెక్యూరిటీస్, రతి సెక్యూరిటీస్ అనేవి ఈ కంపెనీలు.

వీటిలో ఎం.కె. సెక్యూరిటీస్ కంపెనీని పరిశీలిస్తే ఇన్వెస్టర్లను భ్రమలో

ప్రైమరీ ఇష్యూ రివ్యూ

పెట్టి, సునాయాసంగా ధన సంపాదనకు [illegible] వున్న [illegible] తత్వం [illegible] ఇప్పుడికే [illegible] అర్థమవుతుంది.

హైదరాబాదు స్టాక్ ఎక్ఛేంజ్ కార్డు విలువ ఇప్పుడు 35 లక్షల రూపాయలుగా వుంది. మూడు నెలల క్రితం, ఆగస్టులో, పీలా అసోసియేట్స్ అనే సంస్థ బహిరంగ వేలంలో ఇదే కార్డును 35 లక్షలకు కొనుగోలు చేసింది. ఎం.కె. సెక్యూరిటీస్ కంపెనీ అదే కార్డును 65 లక్షల రూపాయలకు కొనుగోలు చేస్తున్నట్లు చెప్తున్నది. విచిత్ర మేమిటంటే, ఈ కార్డును వారు బయట నుంచి కొనడం లేదు. తమ స్వంత పేరుతో, వ్యక్తిగతంగా వున్న కార్డును, కంపెనీ పేరుతో బదలీ చేస్తున్నారు. అదీ 35 లక్షల అసలు విలువకు 30 లక్షల అధిక ధర కలిపి!

అదీగాక ఎం.కె. సెక్యూరిటీస్ కంపెనీ ఆర్థికంగా కూడా పటిష్టంగా లేదు. వారు కొనుగోలు చేసి వున్న కోటి రూపాయల విలువైన వివిధ షేర్లను గ్లోబల్ ట్రస్ట్ బ్యాంకులో తాకట్టు పెట్టి అప్పు తీసుకొని వున్నారు. ఇండియా రబ్బర్ అనే కంపెనీకి చెందిన షేర్లు అధిక ధరలకు కొని సమస్యల్లో పడ్డారు. వీరి మొదటి కంపెనీ - ఎం.కె. అండ్ కో గత పదేళ్ల నుంచి వ్యాపారం చేస్తున్నా ఏ ఏడాది కూడా 4 లక్షలు మించి లాభాలు చూపలేదు. ఇప్పుడు పబ్లిక్ ఇష్యూకు వచ్చే కంపెనీ గత సంవత్సరపు టర్నోవరు కేవలం 12 లక్షలు అందులో లాభం లక్షా 60 వేలు మాత్రమే

వీరికి 3వ గ్రేడ్ మర్చంట్ బ్యాంకరు గుర్తింపు వుంది. మొదటి గ్రేడ్ మర్చంట్ బ్యాంకర్లే లాభాలు ఆర్జించడం లేదు. ఇక మూడవ కేటగిరీ సంస్థలు సాధించే దేమున్నది?

స్టాక్ ఎక్ఛేంజి కార్డుకు, తమ స్వంత అప్పులు కట్టుకోవడానికి ఎంకె సెక్యూరిటీస్ పబ్లిక్ ఇష్యూ ధనాన్ని దుర్వినియోగం చేసే ప్రమాదం వుంది.

ఇటువంటి కంపెనీల ఇష్యూలకు డబ్బు కడితే గోవిందే!



# డాలర్ ధర ఇట్నే పెరిగితే పెట్రోలు బంగారమౌతుంది!

అమెరికన్ డాలర్‌తో రూపాయి మారకం విలువ పతనానికి అడుగు అంచు లేకుండా పోతున్నది. డాలర్‌తో పరుగందు కోవడం రూపాయికి అలివి కావడం లేదు. ఈ వారంలో డాలరు విలువ రు. 35.90 లకు చేరుకున్నది.

ఒక పరిమితి వరకు డాలరు ధర పెరిగి వుంటే ఆర్థిక వ్యవస్థకు వుపకరమే; కాని అదుపులేని విశృంఖల రూపాయి పతనం ఆర్థిక వ్యవస్థ పై చాలా చెడు ఫలితాలు కల్గిస్తుంది. కేవలం ఎగుమతుల మీద ఆధారపడి వుండే కంపెనీలు మాత్రం డాలర్ బలపడడం పట్ల సంతోషంగా వున్నాయి. డాలర్ ధర రు. 35 ల ప్రాంతంలో ఈ ఏడాది పొడవునా చలిస్తే ఐటిసికి 100 కోట్ల రూపాయల లాభం అదనంగా వస్తుందని అంచనా. మిగతా ఎగుమతి దారులూ తమ తమ స్థాయిలో అధిక లాభా లార్జిస్తారు. కాని, దిగుమతుల మీద ఆధార పడి వుండే వారి పరిస్థితి ఘోరం. రిలయన్స్ కంపెనీ ఈ మార్పుల వల్ల ఏడాదికి రెండు వందల కోట్ల వరకు నష్ట పోతుందని అంచనా. డాలర్ ధర మరింత పెరుగు తుందని వదంతులు విన్పిస్తున్నాయి. దుబాయి హవాలా మార్కెట్‌లో డాలర్‌ను రు. 37 లకు విక్రయి స్తున్నారు.

డాలర్ విలువ ప్రభావం పెట్రోలియం ఉత్పత్తులు, బంగారు ధరల మీద ప్రధానంగా కన్పిస్తున్నది.

బంగారం ధర మిన్నంటుతుంది!

బంగారం ధర సవర రు. 5000లకు మించి పెరిగి పోయే అవకాశం వుంది. వెండి కూడా మరొక 12 శాతం వరకు పెరుగు తుంది. పెట్రోలు ధర లీటరుకు రు. 3 లేదా 4 లు పెరిగినా ఆశ్చర్య పడనవసరం లేదు. పెట్రోలియం ఉత్పత్తుల కంపెనీలు తీవ్ర ఆర్థిక సంక్షోభం చవిచూస్తాయి. ఇప్పటికే దిగుమతి దారులు, కార్పొరేట్ సంస్థలు డాలర్లను కొని నిల్వ చేసుకోవడానికి పోటీ పడ్తున్నారు.

విదేశీ ఇన్వెస్టర్లు మాత్రం డాలర్ విలువ అధికమయ్యే కొద్దీ లాభాలు పొందుతారు. షేర్ల ధరలు తగ్గడం వారికొక అనుకూలమైతే, వారు పెట్టుబడి పెట్టే ప్రతి ఒక్క డాలర్‌కు 3 రూపాయలకు మించి అదనంగా రూపాయలు లభించడం రెండవ లాభం. అయితే డాలర్ ధర ఇదే విధమైన మార్పులకు గురైతే విదేశీ ఇన్వెస్టర్లు మన దేశంలో పరిశ్రమలు పెట్టడానికి సందేహిస్తారు. తద్వారా పెట్టుబడులు తగ్గి, పారిశ్రామిక ప్రగతి కుంటు పడుతుంది.


జమీన్‌రైతు
సంవత్సర చందా రు. 100/-
అర్థ సంవత్సర చందా రు. 50/-
విడిప్రతి రు. 2

# న్యాయమైన కోరిక

ఐక్యరాజ్య సమితి భద్రతా మండలిలో భారత దేశానికి సభ్యత్వం కల్పించాలని ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహారావు గారు కోరిన కోరిక న్యాయమైనది; అవశ్యం నెరవేర్చ వలసినది. ఐక్యరాజ్య సమితి మనుగడకు కీలకమైన ఈ మండలిలో ఇప్పటి వరకు కేవలం ఐదు దేశాలే సభ్యత్వం కల్గి వున్నాయి. అవి - అమెరికా, రష్యా, ఇంగ్లండు, ఫ్రాన్స్, చైనాలు; వీటికి మాత్రమే ఐక్యరాజ్య సమితి నిర్ణయాలను వీటో చేసే అధికారం వుంది. విస్తృతమైన, విశ్వశాంతిని కాపాడ వలసిన ఈ ప్రపంచ సంస్థలో ఆసియా, ఆఫ్రికా ఖండాలకు సరైన ప్రాతి నిధ్యం లేదు. భద్రతా మండలిని విస్తృత పరచాలని జవహర్ లాల్ నెహ్రూ పదే పదే కోరే వారు. ఆ వాదన ఇన్నాళ్లకు బలం పుంజుకొన్నది. భద్రతా మండలిని విస్తృత పరచడం ద్వారా భారత్‌కు స్థానం కల్పించాలని ప్రధాని పివి కోరుతున్నారు. ఈ విషయంలో భారత్‌కు జర్మనీ, జపాన్ వంటి దేశాల నుంచి గట్టి పోటీ ఎదురౌతున్నది. ఆర్థిక సంపద ఆధారంగా తాము బలీయులమని, అందువల్ల తమకే కొత్త కుర్చీ కేటాయించాలని ఆ రెండు దేశాలూ అడుగుతున్నాయి. ఇది అసంబద్ధమైన వాదన. ఐక్యరాజ్య సమితి పై ఇప్పటికే ధనవంత దేశాల పెత్తనం అపారంగా వుంది. ఒక రకంగా చెప్పాలంటే అమెరికా ఐక్యరాజ్య సమితిని తన గుత్త సొత్తుగా మార్చుకున్నది. సమితి నిర్వహణకు అధిక మొత్తంలో విరాళం ఇవ్వడం వారి అహంకారానికి కారణం. గల్ఫ్ యుద్ధ నివారణకు సమితి చర్యలు చేపట్టకుండా చేతులు కట్టి పడేయడం, ఇజ్రాయిల్ దుశ్చర్యలను నిలువ రించడంలో సమితి స్వేచ్ఛను హరించడం వంటివి సమితి పై అమెరికా పెత్తనాన్ని ప్రపంచానికి చాటి చెప్పాయి. ఈ పరిస్థితులలో ఆర్థిక సంపద ఆధారంగా మరొక దేశాన్ని ఆ పీఠం పై కూర్చో బెడితే ప్రపంచ శాంతి కంటే, వ్యాపార స్వార్థం సమితి లక్ష్యంగా మారుతుంది.

అదీగాక ఇప్పటికే ఐరోపాకు చెందిన రష్యా, ఇంగ్లండ్, ఫ్రాన్స్ దేశాలున్నాయి. మరొక ఐరోపా దేశాన్ని ఆ మండలిలో చేర్చడం తతిమా ఖండాలను అవమానించడమే అవుతుంది. ఆ దృష్టితో చూస్తే జర్మనీ అనర్హు రాలిక్రింద లెక్క. ఇక జపాన్ కోరిక అర్థ రహితమైనది. డబ్బు తప్ప మరేమీ లేని బుల్లి దేశమిది. ప్రపంచ జనాభాలో సగభాగం వున్న ఆసియా ఖండానికి వీరు ప్రతినిధులు కానేలేరు.

జనాభా రీత్యా, భౌగోళిక స్థితి దృష్ట్యా, విశ్వమానవాళి శ్రేయస్సు కోసం సల్పిన కృషిని బట్టి, మూడవ ప్రపంచ దేశాల నాయకురాలిగా భారత దేశానికి ప్రాతినిధ్యం కల్పించడమే న్యాయం, ధర్మం. అందువల్లే ప్రధాని శ్రీ పివి తన వాదం విన్పించి నప్పుడు వర్ధమాన దేశాల నుంచి సానుకూల ప్రతి స్పందన కన్పించింది. మారిషస్ వంటి దేశాలు బహిరంగంగా మద్దతు ప్రకటించాయి.

ఐక్యరాజ్య సమితి ఏర్పడి నప్పుడు కేవలం 50 లోపు దేశాలే అందులో సభ్యత్వం తీసుకున్నాయి. ఇప్పుడు వాటి సంఖ్య 185 కి పెరిగింది. ఈ యాభై ఏళ్ల సుదీర్ఘ కాలంలో ప్రపంచ రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో ఎన్నో మార్పులు వచ్చాయి. వలస రాజ్య పాలన అంత మొంది పలు దేశాలు సార్వభౌమాధి కారాన్ని, స్వాతంత్ర్యాన్ని సముపార్జించు కున్నాయి. ప్రచ్ఛన్న యుద్ధం ముగిసి దేశాల మధ్య రాజకీయ వైషమ్యాల స్థానంలో వ్యాపార పోటీ పెరిగి పోతున్నది. సాంకేతిక పరిజ్ఞానం, సమాచార వ్యవస్థలు ఎంతో అభివృద్ధి చెంది దేశాల మధ్య దూరం తగ్గి పోయింది. కేవలం కొన్ని దేశాల చేతుల్లో ఆర్థిక సంపద కేంద్రీ కృతమై, తతిమా ప్రపంచం ఆకలి బాధతో, దారిద్ర్య దురవస్థతో అలమటించే స్థితిని వర్ధమాన దేశాల ప్రజలు సహించలేని దశకు చేరువౌ తున్నారు. మారిన ఈ పరిస్థితులలో బడుగు వర్గాల, బీద దేశాల, చిరు రాజ్యాల ప్రతినిధిగా, వారి వాణిని ప్రపంచానికి విన్పింప జేసే అవకాశం భారత్‌కు ఇవ్వడం ఐక్యరాజ్య సమితి కర్తవ్యం.

జమీన్‌రైతు

సమితిలో సముచిత స్థానం లేకున్న ప్పటికీ భారత దేశం విశ్వ శాంతికి తన వంతు కృషిని ఏ అగ్ర రాజ్యానికి తీసి పోని విధంగా నెరవేరు స్తున్నది. పండిట్ నెహ్రూ మేథో సంపత్తి సు... ఆవిర్భ వించిన అలీనో ద్యమ... నేడు వర్ధమాన దేశాల ... కెగా వుపకరిస్తున్నది. మహాత్మా గాంధీ ప్రవచించిన సత్యం, అహింసలు విశ్వశాంతికి తారక మంత్రాలుగా వుపకరిస్తున్నాయి. పలు అంతర్జాతీయ వివాదాలలో ... వంటి అగ్ర రాజ్యాల ఏక పక్ష వితండ వాదాలను తరచు ప్రతి ఘటించి, ధైర్యంగా వాదించి వర్ధమాన దేశాల నాయకురాలిగా ఇప్పటికే భారత్ గుర్తింపు పొంది వుంది. ఈ దశలో భద్రతా మండలి సభ్యత్వం సాధిస్తే ఈ దేశాల స్వాతంత్ర్య, సార్వభౌమత్వాల సంరక్షణ... భారత్ మరింత పటిష్టంగా కృషి చేయగల్గుతుంది. ప్రధాని శ్రీ పివి తన రాజనీతిజ్ఞతను, చాణక్య మేధో సంపత్తిని వినియోగించి, ఈ ఘనతను సాధిస్తే ఆయన కీర్తి చిరకాలం నిలుస్తుంది.

---

జమీన్‌రైతు

26.10.1945

సం: 0-1-6 పేజీలు:8

## నెల్లూరు ముచ్చట్లు

### ఏకదమ్ రెండు ఖూనీలు

టవున్ హాలుకు ఎదురుగుండా వుండే హోటలు యజమాని టి.కె. నారాయణ నాయరు, ఆయన వుంచుకున్న చెంగమ్మ, యీ ఇద్దరు ఆ హోటలు బైట వరండాలో (ట్రంకురోడ్డు ముఖం) పండుకొని వుండగా 22 తేది రాత్రి 3 గంటలప్పుడు సదరు చెంగమ్మ భర్త ముసలి వాడు వీరయ్య, ఆ యిద్దరిని సఫాయి చేశాడు.

కథ యిది: జంగం వీరయ్య భార్య చెంగమ్మ చాలా కాలంగా యీ టి.కె. నారాయణ నాయరు వద్ద వుంటూ వున్నది. భర్త ఒక్కొక్కప్పుడు కలహించినా అతనూ గూడా ఈ హోటలులోనే పని జేస్తున్నాడు. యీ పాడు పొట్ట పూడ్చు కోవాలె గదా! యీ వీరయ్య కొమార్తెను తన భార్య, నాయరు, ఇద్దరు కలిసి ఇంతకు ముందే దక్షణాదిన నరపసరం క్రింద విక్రయించి డబ్బు తట్టుకొచ్చారు. యిప్పుడు ఆ హోటలును గూడా యితరులకు అమ్మేసి అడ్వాన్సు గూడా తీసుకున్నారు. కొరవ డబ్బు తీసుకొని నవంబరు ప్రథమ వారంలో ఈ నాయరూ, చెంగమ్మ యిద్దరూ పరారీ చిత్తగించ డానికి బహిరంగంగా తయారీ-

వీరయ్య చెప్పే మాటలివి: 22 తేది రాత్రి తాను హోటలు లోపల పడుకున్నాననీ, తన భార్య - నాయరూ యిద్దరూ బైట వరండాలో పడుకొని వున్నారనీ, ఒక వేళప్పుడు మెలుకువ రాగా వీరిద్దరూ మాట్లాడు కుంటుండి నారనీ, తర్వాత యిద్దరూ ఒకటిగా వుండగా చూచి ఓర్చుకోలేక తర్వాత వారిద్దరూ విడివిడిగా నిద్రించే దాకా నిదానించి కత్తి, కర్ర రెంటితో బైటకు వచ్చి ఆక్రోశం పట్టలేక ముందు నాయరును, తర్వాత తన భార్యను చంపానని చెపుతున్నాడు.

ఈ ఖూనీలు జరిగే టప్పుడు ఈ వీరయ్యతో గూడా పండుకొని వున్న మరిద్దరు నాయర్లు లేచి ఒకడు కన్యాకుమారీ దిక్కు పరారీ చిత్తగించాడు. మరొకడు పోలీసు స్టేషన్‌కు పరుగెత్తి యీ వార్త అందించాడు. పోలీసులు పరుగెత్తే టప్పటికి యజ్ఞకర్త వీరయ్య కత్తి, కర్ర చేత బట్టుకొని యీ హోటలుకు యెదురు గుండానే కూర్చొని వుండగా పోలీసులు పట్టు పరుచు కున్నారు.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

వీరయ్య, తానొక్కడే యీ రెండు హత్యలూ చేశాననీ, యింకెవ్వరి సహాయం లేదని చెపుతున్నాడు. యీ ఇద్దరూ తాగి మత్తులో వున్నట్లున్నది. యీ వీరయ్యకు మమారు 60 సంవత్సరాల వయస్సు వుంటుంది.

రక్తసిక్తమైన యీ రెండు కళేబరాలు చూడడానికి మహా ఘోరంగా కనిపిస్తున్నవి.

కొరవ10వ పేజీలో

---

# విదేశీ వ్యాపారులతో ఎప్పటికైనా దేశానికి ముప్పే!

దేశభక్తిని ప్రదర్శించడ మంటే విదేశాలను ద్వేషించాలని కాదు. ఇరుగు పొరుగు దేశాలతో దెబ్బ లాడటం అంత కంటే కాదు. పనికి మాలిన పాత దురాచారాలను పవిత్రత పేరుతో నెత్తి మీద పెట్టుకో కూడదు. అవసరం లేని రంగాల్లోకి విదేశీయుల్ని ఆహ్వానించడ మంటే కొరివిలో తలగోక్కో వడమే అవుతుంది. మన దేశంలో పత్రికా రంగం నాడు - నేడు శక్తి వంతంగా ప్రయోజన కరంగా వుంది. అలాంటప్పుడు, మన దేశ పత్రికా రంగంలో విదేశీయుల్ని పిల్చి పీట వెయ్యడ మెందుకు? వినియోగ దారులు నిత్యం వాడే తల నూనెలు, కాఫీ, టీ, సబ్బులు, ఉత్పత్తి చేయడానికి విదేశీ సంస్థ లవసరమా? గతంలో కేవలం వ్యాపారం మిషతో సూదిలా మన దేశంలోకి జొరబడ్డ తెల్ల వారు కాల క్రమేణా దబ్బళమై... గునపాలై... భరత మాత గుండె లోతుల్లో దించారు. శతాబ్దాలుగా దాస్యంలో మ్రగ్గిన చరిత్రను అప్పుడే మనం విస్మరిస్తే ఎలా? ప్రైవేటీకరణ సరళీకృత నూతన ఆర్థిక విధానాల పేరుతో మన మనుగడకు కష్టమైన విధానం అవలంబించడం తగదు. తెల్ల దొరల తెలివే తెలివంటూ అన్నింటికీ విదేశీయుల మీద ఆధార పడడానికి అలవాటు పడితే అంతే సంగతులు. దేశ భద్రత, సమగ్రత, ప్రగతుల దృష్ట్యా, స్వావలంబన కోసం స్వదేశీ ఉద్యమాన్ని పునః ప్రారంభించడం తక్షణావసరం.

గూడూరు -పి.వి. ప్రభాకరరావు

## టౌన్‌బస్సులను అదుపు చేసే అధికారి లేడా?

నెల్లూరు టౌన్‌లో నానాటికీ జనాభా పెరిగి పోతున్నది. కాని పెరుగుతున్న జనాభాకు పరిపో...

## జనవాణి

...నంతగా టౌన్ బస్సుల పర్మిట్లు జారీ చేయడంలో రవాణా శాఖ విఫల మవడంతో బస్సుల్లో రద్దీ ఎక్కువైంది. 60 మంది ప్యాసింజర్లను ఎక్కించ వలసిన బస్సుల్లో 100 మందికి పైగా జనాన్ని కుక్కుతున్నారు. స్త్రీ, పురుషుల వివక్షత పాటించడం లేదు. పోటీలు పడి క్రాసింగ్ చేసే సమయంలో రోడ్డు మార్జిన్ దాటడం వల్ల ఏర్పడే కుదుపులకు బస్సుల్లో త్రొక్కిస లాట జరుగుతుంది. కండక్టర్, చెకింగ్, క్లీనర్లు వ్రాయటానికి వీలు గాని భాషను ప్రయాణీకుల పై ప్రయోగిస్తుంటారు. టేప్ రికార్డర్లలోని పాటలు అమిత అసహ్యంగా వుంటున్నాయి. ప్రతి బస్టాపులో నిమిషాల తరబడి కొన్ని బస్సులు ఆపేసి ప్రయాణీకుల సహనాన్ని పరీక్షిస్తున్నాయి. టౌన్ బస్సులను సక్రమంగా నడిపే విషయమై కలెక్టర్, ఎస్పీ, ఆర్టీసి, ప్రజా సంఘాలతో కలసి ఒక కమిటీని నియమించాల్సి వుంది.

కలిచేడు -షేక్ మహబూబ్ బాషా

## ఈనాడు టెలివిజన్ పంట పండింది!

హైదరాబాద్ దూరదర్శన్ అధ్వాన్న స్థితిలో వుండడం, ఇతర తెలుగు టివి ఛానల్స్ తగినంత పోటీ ఇవ్వక పోవడంతో ఈనాడు టెలివిజన్‌కు ప్రస్తుతం ఎదురు లేకుండా వుంది. వచ్చే నెల నుంచి జరిగే రాష్ట్ర శాసన సభా సమావేశ సన్నివేశాలను టివిల్లో ప్రసారం చేయాలని ప్రభుత్వం సంకల్పించింది. ఈ మేరకు టెండర్లు ఆహ్వానించింది. దూరదర్శన్ ఈ విషయం పై శ్రద్ధ చూపించలేదు. వచ్చిన నాలుగు టెండర్లతో తనకు అంతగా వుంటున్న ఈటివిని చంద్రబాబు నాయుడు ఎంపిక చేశారు. గంట సేపు ఈ కార్యక్రమాలు ప్రసారం చేసినందుకు రోజుకు లక్షా 30 వేలు చొప్పున, అంటే సంవత్సరంలో సభ జరిగే 75 రోజులకు కోటి రూపాయలు ఈనాడు టెలివిజన్‌కు రాష్ట్ర ఖజానా నుండి ముట్టుతాయి. ఇప్పటికే పూర్తి స్థాయి స్పాన్సర్ల వినియోగం లేకనే ఈనాడు టివి తన కార్యక్రమాలు

కొరవ 11 పేజీలో

# నిధులు లేకుండా సమస్యలు పరిష్కరించడమెట్లా?

మాజీ ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు ప్రారంభించిన ప్రజా సదస్సులకు కార్బన్ కాపీగా తాము చేపట్టిన కార్యక్రమానికి ప్రజల ముందుకు ప్రభుత్వం అని పేరు పెట్టారు చంద్రబాబు. నోడల్ అధికారులు తమకు కేటాయించిన ప్రతి చిన్న గ్రామం తిరిగి ఆయా గ్రామాల్లోని సమస్యలు అక్కడి కక్కడే పరిష్కరించాలనేది ఈ కార్యక్రమ ఉద్దేశ్యం. గ్రామాల్లో ఏళ్ల తరబడి కొనసాగుతున్న సమస్యలుంటాయి; వీటిని పరిష్కరించాలంటే నిధులు క్రుమ్మరించాలి. ఈ విషయం 21 తేది కలెక్టరేట్‌లోని సైక్లోన్ మీటింగ్ హాలులో మంత్రి రమేష్ రెడ్డి అధ్యక్షతన జరిగిన సమీక్ష సమావేశంలో కూడా ప్రస్తావనకు వచ్చింది. ప్రజలు ప్రధానంగా ఎదుర్కొంటున్న సమస్యల దృష్టిలో వుంచుకొని, నిధుల గూర్చి తెలుసుకొని అధికారులు హామీ ఇవ్వాలని మంత్రి కోరారు. ఈ కార్యక్రమాన్ని ఏ విధంగానైనా విజయవంతం చేయాల్సిన బాధ్యత అధికారుల పై వుందన్నారాయన. కొత్త ముఖ్యమంత్రి ఆశయాన్ని నిధులు లేకుండా ఏ విధంగా పూర్తి చేస్తారన్నది సమాధానం దొరకని ప్రశ్న! జిల్లాలో రోడ్లు, తాగు నీటి సమస్య మాత్రం

**ప్రభుత్వ ప్రచార ప్రహసనం**

తీరుస్తానని మంత్రి హామీ ఇచ్చారు. పక్కా గృహాలు నిర్మించేందుకు పుష్కలంగా నిధు లున్నాయని; వీటికి మాత్రం పూర్తి హామీలు ఇవ్వమని అధికారులకు మంత్రి భరోసా ఇచ్చారు. పొలాల్లోంచి రైతులు ధాన్యం తెచ్చుకొనేందుకు లింక్ రోడ్లు ఏర్పాటు చేస్తామన్నారు. వీటికి నిధులెక్కడున్నాయో చెప్పలేదు. ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ మాట్లాడుతూ నవంబర్ 1 తేది నుంచి ఈ కార్యక్రమం ప్రారంభిస్తున్నట్లు చెప్పారు. జిల్లాలో భూమి లేని పేద హరిజనులకు 2,500 ఎకరాల భూమిని కొనుగోలు చేసి పంచాలని నిర్ణయించినట్లు చెప్పారాయన. నోడల్ అధికారులు పర్యటనకు వెళ్లినప్పుడు ప్రభుత్వ కార్యాలయాలను తనిఖీ చేస్తే అవి కొంత వరకు బాగు పడతాయన్న భావనను కలెక్టర్ వ్యక్తం చేశారు. అదే విధంగా అధ్వాన్నంగా వున్న పి.హెచ్.సి.ల విషయం కూడా పరిశీలించా

కొరవ 10 పేజీలో

# హరిజన రిజర్వేషన్లతో ప్రతిభకు లోపం రాదు!

రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి కడియం శ్రీహరి మంచి వక్త. జీవిత భీమా సంస్థ ఎస్.సి. ఎస్.టి. ఉద్యోగుల సంక్షేమ సంఘం సర్వసభ్య సమావేశం వేదిక పై ఈ నిజం తెలిసింది. 22 తేది టౌన్ హాల్‌లో రిజర్వేషన్ల సమస్య పై మంత్రి చాలా లోతుగా మాట్లాడారు. వర్గాలతో కుంచించుకు పోకుండా సమాజంలో అందరిని కలుపుకు పోండని ఎస్సి,ఎస్టిలకు సలహా ఇచ్చారాయన. రాజకీయాల్లో ఏ స్థానాన్ని అయినా బలహీన వర్గాల వారు పొంద గలుగు తున్నారంటే అందుకు రిజర్వేషన్లు కారణమని, ఐక్యత కొరవడడంతో వాటిని కోల్పోయే ప్రమాదం ఏర్పడిందని; వాటిని కాపాడు కొనేందుకు ముందుకు రావాలని పిలుపు నిచ్చారు. రిజర్వేషన్ల వల్ల ప్రతిభ దెబ్బ తింటుందనే వాదన అవాస్తవమన్నారాయన. 1950 నుంచి రిజర్వేషన్లు అమలులోకి వచ్చినా హరిజనులకు అన్యాయం జరిగింది, అవి సక్రమంగా అమలు జరిగి వుంటే, ఎస్.సి, ఎస్.టిలు ఎప్పుడో పైకి వచ్చే

**నెల్లూరు సంగతులు**

వారు; అభివృద్ధి నంతా పాలకులు అంకెల్లో చూపి పచ్చి మోసం చేసినట్లు చెప్పారు. తమ ప్రభుత్వం రాష్ట్ర వ్యాప్తంగా ఎస్.సి. ఎస్.టి. బ్యాక్‌లాగ్ పోస్టులను భర్తీ చేసేందుకు జిల్లా కలెక్టర్ ఛైర్మన్‌గా జిల్లా సెలక్షన్ కమిటీలను ఏర్పాటు చేసినట్లు తెలిపారు. ఈ పోస్టులను వచ్చే మార్చి నెలాఖరులోగా భర్తీ చేయాలని జిల్లా కలెక్టర్లను ఆదేశించారట. సాంఘిక సంక్షేమ శాఖకు చెందిన 100 కోట్ల రూపాయల నిధులను గత కాంగ్రెస్ ప్రభుత్వం ప్రక్క శాఖలకు మళ్లించిందని, ఇది ఆ పార్టీకి ఎస్సి, ఎస్టిల పట్ల వున్న ప్రేమను చాటు తుందన్నారు. సమావేశంలో రాష్ట్ర

సెకండరీ విద్యాశాఖా మంత్రి బల్లి దుర్గా ప్రసాద్, సూళ్లూరు పేట ఎమ్మెల్యే పరసా రత్నం, జీవిత భీమా సంస్థల శిక్షణ కేంద్రం ప్రిన్సిపల్ ఎం.వి. రమణ, అసోసియేషన్ అధ్యక్షుడు డి. విక్టర్ బాబు, కార్యదర్శి ప్రసాద రావు తదితరులు పాల్గొన్నారు.

కొరవ 10 పేజీలో



నెల్లూరులో జరిగిన ప్రజల ముంగిటకు ప్రభుత్వ కార్యక్రమ ప్రారంభోత్సవ సభలో మంత్రి రమేష్‌రెడ్డి, కలెక్టర్ గిరిధర్, డిడిఒ విష్ణు.

# స ణు గు డు

*** టౌన్‌కు పట్టిన గబ్బును వదిలించను మునిసిపాలిటీ చేస్తున్న కృషి ఏది?**

నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ ఏర్పడి, ఆరు నెలలు గడిచి పోయాయి. ఎన్నికల్లో గెల్చిన ఏ ప్రజా ప్రతినిధికైనా, పౌర సంస్థకైనా తమ తమ సీట్లలో కుదురుకొని కూర్చోవడానికి కనీసం ఆరు నెలల వ్యవధి కావాలి. ఈలోగా వారిని ఏమి చేయలేదు, ఇది చేయలేదు అని తప్పు పట్టడం తొందరపాటే అవుతుంది. కానీ నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్‌కు తాము చెయ్యాల్సిన పనులేవో తెలుసు కోవడానికి ఆరు నెలలు కాదు, ఆరు సంవత్సరాలు పట్టేట్లు వుంది. గ్రూపు గొడవలు, ముఠా పెత్తనాలు, అర్థం లేని వ్యర్థ వివాదాలతో కాలక్షేపం తప్ప పౌర సమస్యలు తెలుసుకొని, సరిదిద్దాలనే ఆలోచనే వారిలో కల్గడం లేదు.

ఎంత గబ్బు పట్టి పోతున్నది టౌన్? ఏదో పనుండి మొన్నొక రోజు చిన్న బజారుకు వెళ్లాను. అది నెల్లూరు టౌన్‌లోని బజారో లేక అడవుల్లోని బురద గుంటో అర్థమే కాలేదు. ఎంత అసహ్యంగా, ఎంత రోతగా, ఎంత గబ్బుగా వుందండీ ఆ రోడ్డు? వన్ టౌన్ పోలీసు స్టేషన్ దగ్గర్నుంచీ పాదాలు మునిగే బురద; కూరగాయల మార్కెట్ దాకా వచ్చేసరికి మోకాళ్లు సైతం మునిగి పోతాయా అన్పించింది. దాని క్రింద తారు రోడ్డు వుందని ఎవరైనా చెప్తే కాని నమ్మలేము. బురదకు తోడు ఆకులు, చెత్త చెదారం, పారేసిన కూరగాయలు కుల్లి పోయి భరించరాని దుర్వాసన; ముక్కులు పగిలి పోతున్న ఫీలింగ్; ఆ చెత్త దిబ్బల మీద పొర్లాడుతున్న పందుల గుంపు; ఆవుల మందలు. ఛీ.. ఛీ..!

అటు తిరిగి మార్కెట్‌కు అవల, ఈవల వున్న రోడ్లు చూస్తే అవీ అంతే. డ్రైన్లు పొంగి, మురుగు నీరు వరదలుగా పారుతూంది. ముక్కుకు చెయ్యి అడ్డం

**డోలేంద్ర**

పెట్టుకొని నడవాలా? ప్యాంటు, పంచ ఎగబట్టుకొని నడవాలా? బురదలో జారి పడకుండా ఏ గోడో, స్తంభమో వూతం చేసుకొని నడవాలా? రోడ్లో పోయే సైకిళ్లు, స్కూటర్లు ఆ ఛండాలపు మురుగును చిలక రిస్తుంటే ప్లాట్ ఫారం పైకి ఎగిరెగిరి దూకి కాపాడు కోవాలా? మధ్యలో మూతలేని మ్యాన్ హోళ్లలో మునిగి పోకుండా జాగ్రత్త పడాలా?..... వెధవది, ఒక్క రోడ్డులో నడవాలంటే ఎన్ని పాట్లండీ?

ఏమి చేస్తున్నది మునిసి

కొరవ 7 పేజీలో

# నార్వే యువతి ఆగంలో నిజం లేదని తేలింది!

* అత్యాచారం జరగలేదని ధృవీకరణ
* ఆందోళన కారుల నీచపు తిట్లు
* ఈ బ్లాక్ మెయిల్‌కు శిక్షలేదా?
* ఇకనైనా సన్మార్గంలో నడవండి!

అమెరికనాస్పత్రిలో నార్వే యువతి సిగ్నే లేలాండ్ పై అత్యాచారం జరిగిందన్న ఆగం అనుకున్న మలుపు తిరిగింది. ఆమె మామ జాన్ సిలాస్‌నార్వే నుంచి వచ్చి, ఆమెను తీసుకొని వెళ్లి పోయారు. అక్కడకు వెళ్లిన తర్వాత ఆయన డాక్టర్ దేవరాజ్ పూలాకు ఒక ఫ్యాక్స్ సందేశం పంపారు. సిగ్నే పై ఎటువంటి అత్యాచార యత్నం జరగ లేదని, కల్చరల్ షాక్‌కు గురైన ఆమె మతి స్థిమితం తప్పి ప్రవర్తించిందని, ఆమెను ... కాలంలో మానసిక వైద్యుల పర్యవేక్షణలో వుంచడం తమకెంతో సంతోషం కల్గించిందని ఆ సందేశంలో పేర్కొన్నారు. సిలాస్. ఇంకా ఈ విషయంలో ఎవరికైనా అనుమా నాలుంటే తనను సంప్రదించ వచ్చునని తన చిరునామా కూడా ఇచ్చారు. తాను జర్నలిస్టునని, పోలీసుగా కూడా శిక్షణ పొందిన వాడినని; పరిస్థితులు, సంఘటన లన్నింటినీ కూలంకషంగా అధ్యయనం చేసి తాను నిర్ణయానికి వచ్చానని; సిగ్నే కూడా తన పై అత్యాచారం జరిగినట్లు ఎటువంటి ఫిర్యాదూ చేయలేదని ఆయన స్పష్టం చేశారు.

స్వయంగా సిగ్నే మామ ఎటువంటి అత్యాచారం జరగ లేదని తేల్చి చెప్పినా వివిధ సంఘాలు చేపట్టిన ఆందోళన కార్యక్రమం ఆగలేదు. గాంధీ బొమ్మ వద్ద రిలే నిరాహార దీక్షల... ...స్తూనే వున్నాయి. మహిళా నాయకురాళ్లు, దళిత సంఘాల నాయకులు పరమ నీచమైన భాషలో అందర్నీ తిట్టి పోస్తున్నారు. అమెరికనాస్పత్రి మూసివేయాలని బెందిరించాలని అరెస్ట్ చేసి తీరాలని పట్టు బడుతున్నారు. తాము చెప్పిన మాట పోలీసు వినడం లేదని ఆగం చేస్తున్నారు.

అసలీ ఆందోళన కారులు చెప్పిన మాటను పోలీసులే కాదు, ఎవరైనా ఎందుకు వినాలి? పది మంది

> అమెరికనాస్పత్రి అఘాయిత్యం ఇంక ఆపండి!

జనాన్ని పోగేయగల సత్తా వున్న వారు వీధిలోకి వచ్చి ఫలానా వాడు దుర్మార్గుడు, వాడిని పట్టి కట కటాల వెనక్కు నెట్టండి అని పెద్దగా అరిస్తే ప్రభుత్వము - పోలీసు యంత్రాంగము భయపడిపోయి వారి ఆజ్ఞ శిరసా వహించాల్సిందేనా? ఏమిటీ అఘాయిత్యం? ఎంత అరాచక మయమైన ప్రయత్నం?

పోలీసు సరే, నేర నిర్ధారణ చేయడంలో నిర్లక్ష్యం వహించి, విఫలమైనారను కుందాం; ఆందోళన కారులు తేల్చిన నిజం ఏమిటి? 14 తేది నుంచి 21 తేది వరకు సిగ్నే లేలాండ్ మద్రాసులో, అమెరికన్ రాయబారి... సంరక్షణలో వుంది. ఆ సమయంలో ఆమె ప్రక్కన నెల్లూరు పోలీసులు లేరు; అమెరికా నాస్పత్రి సిబ్బంది లేరు. ఆమె పై ఎటువంటి ...డులు, ప్రలోభాలు, బెదిరింపులు వచ్చే అవకాశం లేదు. అమెరికన్ రాయబార కార్యాలయం రక్షణలో వున్న ఏ వ్యక్తిపైనా దేశంలో ఎంత పెద్ద పలుకు బడి కల్గిన వారూ ఎటువంటి ఒత్తిడి తేవడం అసాధ్యం. నిజం రాబట్ట డానికి అమెరికన్ అధికారులు, ఆమె మేనమామ, మద్రాసు ఆస్పత్రి సైక్రియాట్రిస్టులు పలు రకాలుగా ప్రయత్నించారు. వారెవరికీ ఆమె పై అత్యాచార యత్నం జరిగిందన్న అనుమానం కల్గలేదు.

యూరోపియన్ దేశాల సాంఘిక సంస్కృతులు, వారి ప్రవర్తన తెలిసిన వారికెవరికైనా, ఇటువంటి అత్యాచారం నిజంగా జరిగి వుంటే పరిణామా లెంత తీవ్రంగా వుంటాయో, వారెంత వయలెంట్‌గా ప్రతి స్పందిస్తారో అర్థమౌతుంది. సిగ్నే పై అత్యాచార మనేది జరిగి వుంటే, ఆమె తరపున ఆమె బంధువులు ఎవరు కేసు పెట్టినా నష్ట పరిహారం చెల్లించ డానికి డాక్టర్ దేవరాజ్ పూలా తనను, తన ఆస్పత్రిని ఆరు సార్లు అమ్ముకోవలసి వచ్చేది. ఐరోపా దేశాలలో ఇటువంటి సంఘటనలు జరిగితే వారు కోరే నష్ట పరిహారం మిలియన్ డాలర్లలో వుంటుంది. ఒకే దేశాలలో తమ పౌరులకు అన్యాయం జరిగితే సాక్షాత్తు దౌత్య వేత్తలే రంగంలోకి దిగుతారు. ఇరు దేశాల దౌత్య కార్యాలయాల స్థాయిలో, దేశ ప్రధానుల స్థాయిలో రచ్చ జరుగుతుంది. అదేమీ ఆషా మాషీ వ్యవహారం కాదు. సిగ్నే విషయంలో ఎటువంటి తప్పు జరగలేదు కాబట్టే, ఆమె మేనమామ అంత స్పష్టంగా ఫ్యాక్స్ సందేశం పంపారు. కేంద్ర హోం మంత్రిత్వ శాఖకు చెందిన ఇంటలిజెన్స్ అధికారులు ఆయన్ను స్వయంగా కలిసి, సమాచారం రాబట్టి, నిజం ధృవ పరచు కున్నారని వినికిడి. అందువల్లే వారు తిరిగి నార్వే వెళ్లి పోవడానికి కేంద్రం వారికి అనుమ తించింది. లేకుంటే వారిని అక్కడే నిలిపి, దర్యాప్తుకు సహకరించమని అభ్యర్థించి వుండేవారు. అమెరికన్ దౌత్య కార్యాలయం సైతం ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వానికి ఒక నివేదిక పంపిందని, అందులోనూ మానసికంగా సిగ్నే సంక్షోభానికి గురి కావడం తప్ప, మరే అనుమానాస్పద సంఘటనా జరగ లేదని స్పష్టం చేశారని చెప్తున్నారు. సిగ్నే సమీప బంధువులు, తల్లిదండ్రులు, ఆదేశ మిత్ర రాయబారులు చేయని ఫిర్యాదు నెల్లూరులో మహిళా, దళిత నాయకులు చేయడమంటేనే ఈ ఆందోళన వెనక వుండే అసలు అంతరార్థాన్ని చెప్పకుండానే అర్థం చేసుకోవచ్చు.

ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు దీని పై సిబిసిఐడి దర్యాప్తుకు ఆదేశించారు కాబట్టి, ఆందోళన కారులు ఇప్పటి వరకు చేసిన అఘాయిత్యాలు ఆపి, దర్యాప్తు ఫలితం తేలే వరకు వేచి వుండడం సమంజసం.

* * *

అన్ని మహిళా, దళిత, సిపిఎం అనుబంధిత సంఘాల నాయకులూ జమీన్‌రైతు పత్రికను, సంపాదక సిబ్బందిని తమ సంస్కారానికి తగిన భాషలో తిట్టి పోస్తున్నారు; పాటలు కట్టి పాడుతున్నారు; శాపనార్థాలు పెడుతున్నారు; గాలిలో మెటికలు విరుస్తున్నారు. వీరి దృష్టిలో సిగ్నే పై జరిగిందని చెప్పబడుతున్న అత్యాచారం, డాక్టర్ దేవరాజ్ పూలా చేశాడని చెప్పబడుతున్న నేరం కంటే జమీన్‌రైతు వార్త, వ్యాఖ్యలే మహాపరాధంగా క...స్తున్నాయి.

తమ దురుద్దేశ్యాలు, ఆందోళన అసలు స్వరూపం నిర్భయం... బయట పెట్టడమే జమీన్‌రైతు చేసి... ఘోరాతి ఘోర నేరమని వీరి ఆక్రో... పెడ్డ శాపనార్థాలకు ఉట్లు తెగవని వా... తెలిసినట్లు లేదు.

డాక్టర్ దేవరాజా పూలా గారి ... ప్రేమతో గాని, ఆయన్ను వ్యక్తిగతం... సమర్థించాలనే వుద్దేశ్యంతో జా... జమీన్‌రైతు ఈ ఆందోళనను ప్ర... ఘటించలేదు. దేవరాజా పూలాతో మా... ముఖ పరిచయం కూడా లేదు.

దళిత, మహిళా సంఘ... పేరుతో ఇటీవల పెరిగి పోతు... అరాచక ప్రవర్తనను నిరసించ... కోసం; వారి బ్లాక్ మెయిల్‌కు నూ... సేవా సంస్థ అప్రతిష్ట పాలు కావ... అన్యాయమనే వుద్దేశ్యంతో అం... వివరంగా నిజాలు వెల్లడి చేయ... జరిగింది. నార్వే యువతి మేనమా... పంపిన సందేశంతో, మేము వ్రాసి... ప్రత్యక్షరం యథార్థమని రుజువైంది. నిజాలు ముందు గానే ... అధికారులకు తెలుసు; రాజకీ... వాదులకు తెలుసు; పోలీసుకూ తెలుసు... కాని, ఆయా సంఘాలు బ్లాక్ మెయిల్... భయపడి, వారి కోపానికి గురైతే సమ... లెదుర్కో వలసి వస్తుందనే జంకు... అందరూ నోళ్లు కట్టేసు కున్నారు... దినపత్రికా విలేఖరులు కూడా ఎవ... ప్రకటన ఇస్తే అది ప్రచురించడం తప... ఇటువంటి ప్రాధాన్యత ... విషయాలలోనూ తమ ... వుపయోగపెట్టి, వాస్తవాలు ... పరిశోధించి వార్తలు ప్రచురించే శ్ర... తీసుకోక పోవడం వల్ల ఈ సంఘట... అంత సంచల నాత్మక మైంది. ఈకు... ప్రజా సంఘాల దురుద్దేశ్య పూరి... ప్రచారాలకు దిన పత్రికలు ఉచి... వేదికలుగా వుపయోగ పడుతున్నాయి.

ఏటికి ఎదురీదితే వంటి... అలుపు పెరుగు తుంది; పది మం... చెప్పే మాట తప్పని చెప్తే తిట్లు వర్ష... వచ్చి పడ్డాయి. వాటికి మేమేమీ బా... పడడం లేదు.

కాని అసాంఘిక, అరా... వ్యక్తులు, శక్తులు - ప్రజా సంఘ... ముసుగు తగిలించుకుని గిట్లని సంస్థల...

8వ పేజీలో

## మత్స్యకారుల మృత్యు హేల

# చచ్చిన చేప తెచ్చిన పెన్నిధే కుర్రులో రక్తం పారించింది.

అల్లూరు మండలం ఇస్కపల్లి మజరా గ్రామమైన కుర్రులో 23 తేది మత్స్య కారులు ఒకరి పై ఒకరు దాడులు జరుపుకొని హత్యా కాండకు పాల్పడ్డారు. ఈ గ్రామాన్ని ఒక ద్వీప కల్పమన వచ్చు. మూడు వైపులా బంగాళా ఖాతం, మరో వైపు బకింగ్ హామ్ కాల్వతో గ్రామం చుట్టూరా నీళ్లే. అయినా అటువంటి గ్రామంలో వెయ్యి మందికి పైగా జాలర్లు నివాస ముంటున్నారు. 1991 సంవత్సరం డిశంబరు నెల మొదటి వారం వరకు గ్రామస్తులు చేపల వేట పై ఆధారపడి ప్రశాంతంగా జీవనం సాగించేవారు. కాని ఆ ఏడాది డిసెంబరు 12 తేది కుర్రు తీరానికి వచ్చి కొట్టుకొచ్చిన బెల్స్పమ్ వార్ తెగకు చెందిన తిమింగళం ఆ గ్రామస్తులను ఒక్క రోజులోనే లక్షాధి కారులను చేసింది. ఆ చేప కడుపులో దాగిన కోట్ల విలువ చేసే 4 వేల కేజీల అంబర్‌ను పంచుకొనే విషయంలో అప్పటి వరకు ఒకే మాట, ఒకే బాటగా సాగిన గ్రామస్తుల మధ్య విభేదాలు పొడ చూపాయి. మూడేళ్లలో అవి చిలికి చిలికి గాలి వానగా మారి ఈ నెల 23 తేది కొత్త కుర్రు తీరంలో జాలర్ల మధ్య యుద్ధం జరిగింది. ... ... ... ... 7.30 ప్రాంతంలో ... ... బాంబులు ఎగుర వేశారు. ... ఈటెలు, గొడ్డళ్ల వంటి ... ఆయుధాలతో పాటు ...నాటు బాంబులను కూడా ప్రయోగించారు. ఈ యుద్ధంలో కాంగ్రెస్ వర్గీయుల చేతిలో ఇద్దరు తెలుగు దేశం పార్టీ వారు ఎస్. పోలయ్య (28), కొండూరు శెట్టి (30)

> జిల్లావార్తలు

హతులయ్యారు. మరో 17 మంది గాయపడ్డారు. ఈ గొడవ ముందు కొన్ని చిన్నా, చితకా గొడవలు పోలీస్ స్టేషన్‌లో నమోదై వున్నాయి. అంబర్ దొరికే వరకు గ్రామంలో అందరూ కాంగ్రెస్ పార్టీ అభిమానులుగా వుండే వారు. దాన్ని పంచుకొనే విషయమై చెలరేగిన గొడవల్లోనే తెలుగు దేశం, బిజెపి పార్టీలు అక్కడ కాలూనాయి. కుర్రు చుట్టు ప్రక్కల రొయ్యల కంపెనీలు ఎక్కువ కావడంతో గ్రామంలో పలు సమస్యలు మొదలయ్యాయి. తుఫాన్లలో తరచూ మునిగి పోయే ఆ దీవిలోని గ్రామస్తులను కావలి ఆర్డీఓగా పనిచేసిన వాణీ శంకర్ అక్కడి నుంచి తరలింప చేసి సురక్షిత ప్రాంతమైన కొత్త కుర్రులో ఇంటి స్థలం పట్టాలు ఇచ్చేందుకు రంగం సిద్ధం చేశారు. గత అసెంబ్లీ ఎన్నికల్లో కుర్రు గ్రామస్తులు కాంగ్రెస్ అభ్యర్థి విష్ణు వర్ధన రెడ్డికే ఓటు వేయాలని తమ ఆచారమైన దురాయి వేసారు. కాని అది అమలు కాక పోవడంతో గొడవలు మరింత హెచ్చాయి. ఇస్కపల్లి ప్రాంతంలో తెలుగు దేశం పార్టీ వారు ఇటీవలి ఎన్నికల్లో మెజార్టీ విజయాలు సాధించడంతో, కుర్రు పట్టపు పాలెంలోని మైనార్టీ తెలుగు దేశం కార్యకర్తలకు ఎక్కడలేని వుత్సాహం వచ్చింది. ఇది ఇలా వుండగా కాంగ్రెస్ అభిమానులు కొత్త కుర్రులో కేటాయించిన స్థలాల్లో తెలుగు దేశం వారితో కలసి వుండేది లేదని తెగేసి చెప్పారు. తమకు వేరు వేరుగా స్థలాలు ఇవ్వమని కావలి ఆర్డీఓను ఇటీవల కోరారు. ఈ

8వ పేజీలో

# నెల్లూరు నలుచెరగుల్లో
## విహార్క్షకుడు

### జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 26 తేది ఉదయం నెల్లూరు వచ్చి, ఒంగోలులో ఒక వివాహానికి హాజరై, సాయంత్రం వాకాడు వెళ్లారు. ఈ రోజు తిరుపతి మీదుగా హైదరాబాదు వెళ్లి పోయారు.

### రమేష్‌రెడ్డి

మార్కెటింగ్ మంత్రి శ్రీ టి.రమేష్ రెడ్డి ఈరోజు (27 తేది) నెల్లూరు వచ్చారు. ఆత్మకూరు వెళ్లి, బోగోలు రేపు, ఎల్లుండి నెల్లూరులోనే వుండి 29 తేది సాయంత్రం హైదరాబాదు వెళ్తారు.

### హై కోర్టు జడ్జి

హైకోర్టు న్యాయమూర్తి శ్రీ రమేష్ మాధవ్ బాపట్ 26 తేది నెల్లూరు వచ్చారు; 28 వరకు ఇక్కడే వుంటారు. న్యాయవాదులు, న్యాయమూర్తుల మధ్య చెలరేగిన వివాదాన్ని విచారించి తప్పొప్పులు తేల్చడం ఆయన పర్యటనో ద్దేశ్యమని చెప్తున్నారు. ఈ విషయంలో ఎవరైనా ఏదైనా చెప్పు దల్చుకున్నా వినడానికి సిద్ధంగా వున్నారాయన. ఆయన లక్ష్యంతోనైనా న్యాయవాదుల్కు న్యాయమూర్తుల మధ్య నడుస్తున్న అవాంఛనీయ ఘర్షణకు తెరపడితే న్యాయ స్థానాల ప్రతిష్ఠ నిలుస్తుంది.

### సూర్యగ్రహణం

సూర్య గ్రహణం నెల్లూరులోనూ పాక్షికంగా కన్పడింది. 68 శాతం గ్రహణం పట్టినట్లు అంచనా. ఆ సమయంలో సూర్యుడ్ని చూస్తే కళ్లు పోతాయనే భయంతో జనం ఇళ్లకు పరిమితమై పోయారు. ఆ రెండు గంటల పాటు వీధులు నిర్మానుష్యంగా కన్పించాయి.

### బార్ అసోసియేషన్

నెల్లూరు బార్ అసోసియేషన్‌కు కొత్త కార్యవర్గం ఏర్పడింది. శ్రీ పెయూరు వాగేశ్వర రావు కార్యదర్శి; టి.పి. శ్రీనివాస రావు, వి. రఘురామయ్య, కె.ఆర్. దుర్గాంబ, ఆర్. సంజీవ కుమార్, పి. శ్యామ్ కార్యవర్గ సభ్యులు.

### రాఘవరెడ్డి చైనా యాత్ర

నెల్లూరు రైస్ రీసెర్చ్ స్టేషన్ అధిపతి డాక్టర్ పి. రాఘవ రెడ్డి 26 తేది చైనా వెళ్ళారు. చైనాలో హైబ్రిడ్ వరి వంగడాల పై జరుగుతున్న పరిశోధనను అధ్యయనం చేయడం ఈ పర్యటనో ద్దేశ్యం. 20 రోజుల పాటు [illegible] వుంటారు. నవంబరు 18 తేదికి తిరిగి వస్తారు. ఎఫ్ఎఒ [illegible] కార్యక్రమమిది.

రాఘవ రెడ్డి గారికి మా [illegible]

### వసంత్‌కు పదవి

స్వర్గీయ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి తనయుడు శ్రీ పెళ్లకూరు వసంత కుమార రెడ్డిని ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ప్రచార సంఘం సభ్యుడిగా నియమించారు. వసంత్ రాజకీయ జీవితంలో తొలి పదవి ఇది. బెస్ట్ ఆఫ్ లక్!

### బాబుల్‌రెడ్డి

బిజెపి జాతీయ కార్యవర్గ సభ్యుడు శ్రీ పి. బాబుల్ రెడ్డి 25 తేది అల్లూరు వచ్చి పోయారు. స్వంత పనిదే వున్నట్లుంది. చిన్న సభ - నీతి పరులో ఓట్లు వేయమని ప్రజల్ని ఉద్బోధించారు. అంటే తమకు ఓట్లు వద్దనా?

### చంద్రబాబు కమిటీ

చంద్రబాబు తెలుగు దేశం జిల్లా కమిటీ ఏర్పడింది. అధ్యక్షుడు వేనాటి మునిరెడ్డి; మార్పు [illegible] ప్రధాన ఉపాధ్యక్షుడుగా రోడ్డు కాంట్రాక్టుల కుబేరుడు శ్రీ జె. కృష్ణయ్య నాయుడును నియమించారు. ఇంక ఖర్చుకు తడుము కోవలసిన పనే వుండదు. కార్యదర్శిగా తాతా వాగేశ్వర రావు. సంయుక్త కార్యదర్శిగా చేవూరు విజయ మోహన రెడ్డి, ప్రచార కార్యదర్శిగా జెట్టి మదన్ మోహన్, కోశాధికారిగా రమేష్ రెడ్డి బావ శ్రీ వి. ఆనంద రెడ్డి నియమితులైనారు. కార్యవర్గ సభ్యులు - పి. రంగారావు (కావలి) డి. పాపారావు (ఉదయగిరి), రాధాకృష్ణమ నాయుడు (సర్వేపల్లి) నెల్లూరు శ్రీనివాసులు రెడ్డి (ఆత్మకూరు), కె. దశరథ రామరెడ్డి (కోవూరు) పిసి నరసింహ ప్రసాద్ (వెంకటగిరి) ఎం. శ్రీధర కృష్ణారెడ్డి, శ్రీమతి విజయ లక్ష్మి ( నెల్లూరు) మేడా అశోక్ (అల్లూరు); మరొక తొమ్మిది మందిని ప్రత్యేక ఆహ్వానితులుగా పేర్కొన్నారు.

తెలుగు యువత అధ్యక్షుడుగా రమేష్ రెడ్డి ప్రస్తుత ప్రాణ స్నేహితుడు వైవి రామిరెడ్డి నియమితులైనారు.

### వర్షపాతం

జిల్లాలో 22 తేది నుండి ఒక మోస్తరు వర్షం పడుతూనే వుంది. ఈ నెలలో సరాసరిగా ప్రతి మండలంలోనూ 20 సెంటీ మీటర్ల వర్షం కురవాలి; కాని ఈ రోజు (27 తేది) వరకు జిల్లాలో ఆ జాడ లేదు. 22 తేది

నుండి 26 తేది వరకు అల్లూరు 163.4 మిల్లీమీటర్ల అత్యధిక వర్షం రికార్డ యింది; వెంకటగిరిలో 124.6, ముత్తుకూరు 119.2 నెల్లూరులో 99 మిల్లీ మీటర్ల వర్షం కురిసినట్లు నమోదైంది.

### సివికి చిరు పదవి

మాజీ శాసన సభ్యుడు శ్రీ సివి శేషారెడ్డికి చిరు పదవి లభించింది. పార్లమెంట్ ఎన్నికల కాంగ్రెస్ ప్రచార కమిటీలో ఆయన్ను సభ్యుడ్ని చేశారు.

ప్రచార కమిటీ సభ్యత్వాని రేపు ఎన్నికల్లో ఖర్చు చాలక పద్మశ్రీ గారికి టికెట్ లభిస్తే ప్రచారానికి వూళ్లలోకి పోతారేమో శేషారెడ్డి గారూ - వీపు పగిలి పోతుంది అమె పేరుతో ఓట్లడిగితే!

## సణుగుడు

7 పేజీ కొరవ

చేయడం లేదంటే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు. హెల్త్ ఆఫీసర్ గారికి పర్సనల్ హెల్త్ మీద తప్ప, పబ్లిక్ హెల్త్ పట్టదు; టిపిఒ గారికి ఎక్కడెవరు ఏ భవనం అక్రమంగా కడుతున్నారా, దబాయిస్తే ఎంత రాలుస్తారా అన్న ధ్యాస తప్ప వీధులు మూసుకొని పోతున్నాయన్న బెంగ వుండదు. మునిసి పాలిటీ ఎంత అధ్వాన్నమై పోయిందంటే ఎవరైనా పౌరుడు బాధ్యతగా ప్లాన్ పెట్టి ఇల్లు కట్టు కోవడానికి ఆఫీసుకు వెళ్తే పిచ్చి వాడి క్రింద జమ కట్టున్నారు; ఏడ్పించి చంపు తున్నారు. అంతా పద్ధతి ప్రకారం జరిపితే వారికి పైసలు గిట్టే దెట్లా? ఇంజనీరింగ్ సిబ్బంది అతి తెలివికి టౌన్‌లోని రోడ్లు సమాధి తోటలుగా మారి పోతున్నాయి. నేలకు ఒకటిన్నర, రెండడుగుల ఎత్తున మ్యాన్‌హోళ్ళు పునర్ని ర్మిస్తున్నారు. ఎప్పుడో రోడ్డు వేస్తే, ఆ ఎత్తుకు సరి పోవాలట. ఆలోగా అవి సమాధుల వలె అడ్డం పడ్తున్నాయి. ప్రపంచంలో ఎక్కడా ఏ నగరంలోనూ మ్యాన్ హోళ్లను ఇట్లా నిర్మించడం నేను చూడలేదు. వారి అతి తెలివికి జోహార్ల ర్పించాల్సిందే. ట్రంకురోడ్డులో ఒక కల్వర్టు నిర్మించారు - అది రోడ్డుకు అడ్డంగా గోడ కట్టినట్లే వుందది. వాటిని దాట లేక వాహనాలు పడ్తున్న పాట్లు అన్నిన్ని కావు. అంత మేరా రోడ్డు ఇరుకైపోతున్నది.

కౌన్సిలర్లు, ఛైర్మన్ తమ రాజకీయాలు కొంత కాలం ప్రక్కన బెట్టి, ఒళ్లు వంచి పని చేసి, టౌన్‌ను బాధిస్తున్న ప్రధాన సమస్యల్లో కొన్నింటినైనా పరిష్కరించ కూడదా?

## బోగోలు

7 పేజీ కొరవ

చోద్యం చూడడం తప్ప ఏ అధికారి ఆ కాలంలో తగిన సహాయం అందించలేదు.

మధ్యాహ్నానికి ఎస్‌పి శ్రీ పూర్ణ చంద్రరావు, ఎఎస్‌పి, ఆర్‌డిఒ, ఎంఆర్‌ఒ తదితర అధికారులు తరలి వచ్చారు.

మృతులకు నష్ట పరిహారం ఇప్పించ డానికి ముఖ్య మంత్రితో మాట్లాడు తున్నట్లు ఎమ్మెల్యే శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు చెప్పారు.

మృతుల పేర్లివి-

మందా దొరసానమ్మ (60); కటారి పోశయ్య (60); కర్నం రమణయ్య (48); బొమ్మిరెడ్డి రాజేశ్వరమ్మ (30); దేవూరు కొండయ్య (32); కటారి పెంచలయ్య (48); ఉదయగిరి పెంచలయ్య; ఉదయగిరి పెంచల నరసయ్య; దేవూరు వెంకట శేషయ్య (45); బొమ్మిరెడ్డి సుబ్బరాయుడు (48); కె. పెంచలయ్య; మందా పెంచలయ్య (70); దేవూరు వెంకట స్వామి (48); పైడి వేణు గోపాలు (18); వంగల్లు ప్రసూన (10); పోనేపల్లికమలమ్మ (25); ఇప్పగుంట సుజాతమ్మ (25); వీరి కుమారుడు రాఘవ (7) వన్నెం చెంచయ్య (70); కర్నం రమణమ్మ (48); వెటా రామయ్య (40).



ఆత్మకూరు దగ్గర బొగ్గేటిలో సజీవ జలసమాధి చెందిన అభాగ్యుల మృతదేహాలు

## జలసమాధి

(మొదటి పేజీ కొరవ)

సజీవంగా జల సమాధి చెందారు. దురదృష్టవశాత్తు వ్యాన్‌కు వున్న ఒకే ఒక్క తలుపు కాజ్‌వే తూములకు అని పోవడంతో, వ్యాన్‌కు మరే ద్వారము, కిటికీ లేక పోవడంతో ఒక్కరు కూడా బయట పడలేక పోయారు. వ్యాన్ లోపలుండిన స్టెప్నీ టైరు, కొన్ని పత్తి బస్తాలు తలుపుకు అడ్డు పడడంతో లోపలుండే వారూ దాన్ని తెరవ లేక పోయారు.

దారి చూపించ డానికి ముందుగా క్రిందకు దిగిన నలుగురు, ఆఖరి క్షణంలో దూకేసిన డ్రైవరు, క్లీనరు మాత్రం బ్రతికి బయట పడగల్గారు. వ్యాన్ బోల్తా కొట్టే సమయంలో ఒక మూడేళ్ల పసి పాప తల్లి వడిలో నుంచి జారి, తలుపు సందు గుండా నీళ్లలో పడి పోయిందట. ఆ చిట్టి తల్లికి దేముడు ఆయువు పోసి నట్లున్నాడు. నీళ్లలో పడి, తూము గుండా క్రిందకు వచ్చి, ప్రవాహంలో కొట్టుక పోతూ కూడా ప్రాణాలు నిల్పుకున్న ఆ పసిపాపను అక్కడున్న వారు ధైర్యం చేసి ఏట్లోకి దూకి, ఈత కొట్టి రక్షించారు.

సాధారణంగా బొగ్గేటికి వరద వస్తే నాలుగైదు గంటలకు మించి పారదు. దురదృష్టవశాత్తు 26 తేది ఉదయం 6 గంటల నుంచి రాత్రి పొద్దు పోయే వరకు ఉరవడి తగ్గకుండా ప్రవహిస్తుండడంతో వ్యాన్‌లోని వారిని రక్షించే అవకాశం లభించ లేదు. సాయంత్రం వరకు శవాలు కూడా దొరక లేదు.

బండారు పల్లి చక్కెర డీలరు బొమ్మిరెడ్డి సుబ్బరాయుడికి లేక లేక పది హేనేళ్లకు సంతానం కల్గిందట. ఆ సంతోషం పంచు కోవడానికి ఆత్మకూరులో తన భార్య పురిటి విందుకు గ్రామస్తు లందరినీ వెంట బెట్టుకొని వస్తుండి నాడట. అందువల్ల ఆ గ్రామం నుంచి ఆ వ్యాన్‌లో అందరు ప్రయాణీకు లుండినారు. వారితో పాటు అతనూ జల సమాధై పోయాడు పాపం!

ఈ కాజ్‌వేలో ఇటువంటి ప్రమాదాలు జరగడం ఇది ప్రథమం కాదు. గత రెండేళ్లలో ఐదారు బస్సులు ఇక్కే వాలి పోయాయి. అయితే అప్పుడెప్పుడూ ప్రాణ ప్రమాదం జరగ లేదు. ఇన్నిసార్లు బస్సులు బోల్తా కొట్టినా ఆర్ అండ్ బి అధికారులలో చలనం రాలేదు. కాజ్‌వేకు అటు ఇటు లోతు, అంచు తెల్పే సిగ్నల్స్ ఏర్పర్చి వుంటే ఈ ప్రమాదం జరిగి వుండేది కాదు.

ఈ ఘోర మృత్యు క్రీడలో ఆర్‌టిసి అధికారుల నిర్లక్ష్యమూ వుంది. బండారు పల్లెకు నెలన్నర రోజుల నుంచి బస్సు లేదు. రోడ్డు బాగా లేదనే సాకుతో నిల్పి వేశారట. స్థానిక డిపో మేనేజరు గారికి పల్లెలంటే అశ్రద్ధ. వున్న బస్సులు లాభాల కోసం నెల్లూరు - ఆత్మకూరుల మధ్యే నడుపు తున్నారు. ఎన్నిసార్లు చెప్పుకున్నా పట్టించు కోలేదట. ఆయనా బస్సును రద్దు చేయకుంటే గ్రామస్తులు మృత్యు శకటం వంటి గూడ్స్ వ్యాన్ ఎక్కవలసి వచ్చేది కాదు. ఇంత ప్రాణ నష్టానికి ఎవరు బాధ్యత వహిస్తారు - ఆర్ అండ్ బి ఇంజనీర్లా? ఆర్‌టిసి మేనేజరా? ఇటువంటి అధికార్లకు ఆ అభాగ్యుల వుసురు కూడా తగల దెందువల్లనో!

ఆత్మకూరు పల్లెలకు ఇటువంటి వ్యాన్‌లే ప్రయాణ సాధనాలుగా వున్నాయి. ఆరు మృత్యు శకటాలు తిరుగు తున్నాయట వివిధ రూట్‌లలో! గాలి వెల్తురు చొరబడని, బస్తాలు మోసే ఈ బండ్లలో మనుషులను ఎక్కించి త్రిప్పినా అభ్యంతరం చెప్పకుండా వుండేందుకు బ్రేక్ ఇన్స్‌పెక్టర్‌కు, పోలీసుకు నెల మామూళ్లు నిర్ణయమై వున్నాయట. ఇప్పుడు ఇందరి చావుకు కారణమైన వ్యాన్ ఒక ఆర్‌టిసి బస్ డ్రైవర్‌ది. అతగాడు జీతం అక్కడ తీసుకొని, ఇక్కడ వ్యాపారం చేస్తున్నాడు. ప్రమాద సమయంలో అతడే వ్యాన్ తోల్తుండినాడు. ఆ సమయంలో గంజాయి వంటి మత్తు మందేదో సేవించి వుండినాడని, అందువల్లే వ్యానును అదుపు చేయలేక పోయాడని ప్రయాణీకులు ఆరోపిస్తున్నారు.

ప్రమాదం జరిగిన వెంటనే ఎమ్మెల్యే శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు పరుగు పరుగున వచ్చి, శవాల వెలికి తీతను పర్యవేక్షించారు. సాయంత్రం వరకు తిండి నీళ్లు పట్టించు కోకుండా సేవ చేశారాయన. పోలీసును, రెవిన్యూ అధికారులలోనే చలనం రాలేదు. గ్రామస్తులు తాళ్లు, గిళ్లు తెచ్చి లోపలుండిన వారిని బయటకు లాగడానికి ప్రయత్నిస్తుంటే నిలబడి

కొరవ 6 పేజీలో

## సణుగుడు

4 పేజీ కొరవ

పాలిటీ? ఛైర్మన్, వైస్ ఛైర్మన్, కౌన్సిలర్లు, కమీషనరు, ఇంజనీరు, హెల్త్ ఆఫీసరు, హెల్త్ ఇన్స్‌పెక్టర్లు, మేస్త్రీలు, వర్కర్లు, ఎన్ఎంఆర్‌లు.... ఇందరు వున్నారే - వారిలో ఒక్కరు, ఒక్కరంటే ఒక్కరికి పౌరులు పడే ఈ నరక యాతన అర్థం కాదా?

నిధులు లేవనే రికార్డు ప్లే చేయడం ఈ విషయంలో కుదరదు. రోడ్లు వేయడానికో, దీపాలు వెలిగించడానికో, కాలువలు త్రవ్వడానికో, డ్రైన్లు నిర్మించ డానికో అయితే డబ్బు కావాలి. వీధులు చిమ్మడానికి, కాలువలు క్లీన్ చేయడానికి నిధులెందుకు? అందుకు కావలసిందల్లా చిత్తశుద్ధి, పని చేయాలన్న తపన.

మునిసి పాలిటీకి వెయ్యి మంది శానిటరీ సిబ్బంది వున్నారు; రెండు వందల మంది ఎన్ఎంఆర్ లున్నారు. వీరి చేత పని చేయిస్తే సగం టౌన్ గబ్బు వదలుతుంది. కాని వారు పని చేయరు; వారి చేత వీరు పని చేయించరు. ఛైర్మన్ గారు తనకు చాలినన్ని అధికారాలు లేవన్న జంకుతో ఎవర్నీ ఏదీ అనడానికి సాహసించడం లేదు. కమీషనరు గారికి అసలేదీ పట్టదు. ఛైర్మన్, కమీషనర్లిద్దర్నీ ఒక వాన పడిన రోజు ఉదయం నుంచి సాయంత్రం వరకు చిన్న బజారు వీధుల్లో కూరగాయల మార్కెట్ సందుల్లో కాలి నడకన త్రిప్పు గల్గే వారెవరైనా వుంటే బాగుండ నిపిస్తోంది.

కౌన్సిలర్ల కీచు లాటలు, కౌన్సిల్ బాధ్యతా రహిత ప్రవర్తన వల్ల మునిసిపల్ అధికార్లు, సిబ్బందిలో లెక్క లేని తనం పెరిగి పోయి వుంది. రెగ్యులర్ శానిటరీ వుద్యోగులే కాదు, ఎన్ఎంఆర్‌లు కూడా వారానికొక పూట డ్యూటీ

కొరవ 6 పేజీలో

## పెళ్ళకూరును మర్చిపోయేదెట్లా?

అన్నదాత, అజాత శత్రువు, మిత్రాభిమాని, శ్రీ పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి ఇక మనకు లేదు; కీర్తి శేషులయ్యారు!

ఏమి కాల వైపరీత్యం! అంతకు వారం రోజుల క్రితం (4.10.95) ఒక పెండ్లిలో కలుసు కొన్నాం; కౌగలించు కొన్నాం; ఇచ్చ కాలాడాం! పోయిన నెలలో ఫ్రాన్సు పోయాను; ప్రపంచంలో కెల్లా పెద్ద ఎరువుల ఫ్యాక్టరీ రాచర్లపాడు ఏర్పాటుకు అన్నీ సిద్ధమయ్యాయి. పి.ఎ గారికి ఏ తేదీ వీలుంటే ఆ రోజు ఫౌండేషన్ వేయిస్తాను. ఫ్యాక్టరీ ప్రొడక్షన్ ప్రారంభిస్తే గిన్నిస్ బుక్‌లోకి ఇఫ్కో పేరు చేరుతుంది అని చాలా ఉత్సాహంగానే చెప్పారు.

మరి ఇంతగా తిరుగు తున్నావు. ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకో అని నేను అంటే - నాకళ్ళలోకి చూస్తూ - భగవంతు డున్నాడు; పి.వి. వున్నాడు. నాకు దిగులు లేదు, చావు అంటే భయం లేదు అని సీరియస్‌గా జవాబు చెప్పారు.

మరల 13.10.95 శుక్రవారం 10.30 గంటలకు వారి మృత దేహాన్ని చూశాను. వారికి తులసీ దళాలంటే ఇష్టం. పూల మాల తోటి తులసీ దళాలు వారి హృదయం మీద వేశాను. ఆయన ఆత్మ గుర్తించి వుంటుందేమో! ఎక్కడలేని ఏడుపు పెల్లుబికి వచ్చింది. పెదగా ఎక్కిళ్ళు పెడితే ఈయనకేమి వచ్చింది అని నవ్వుతారని భయం.

ఏం "పెళ్ళకూరు" అంటె నీకు అంత అప్యాయత? ఆయన కమ్యూనిస్టు కాదు కదా?" అని అడగ వచ్చు

పెళ్లకూరులో నాకు నచ్చినది, ఆయన నిరంకుశ వ్యతిరేక భావాలు. ఆ నిరంకుశత్వాన్ని ఎదుర్కోవడంలో ధైర్యం, త్యాగం, కృత నిశ్చయం బాగా వుండేవి. ఆ ఉద్యమంలో ఆ భావాలున్న వారిని కలుసుకొని పని చేసే వారు. చిన్నా, పెద్దా, పేద, ధనికుడు అనే విచక్షణ లేకుండా ఆ ఆశయ సిద్ధి కోసం కృషి సల్పారు.

తనతో కలసి పని చేసిన వారిని మరువడు. ఏదో రూపంగా కృతజ్ఞత చూపించే వాడు. తను వారికి ఆజన్మాంతం రుణపడి ఉన్నట్లుగా వ్యవహరించే వాడు.

చాలా కాలం క్రితం ఒక రాజకీయ క్రిమినల్ కేసులో నన్ను శ్రీ పెళ్ళకూరు లాయరుగా నియమించారు. వివరాలు అనవసరం. ఆనాటి నుండి ఈ

అనంతరామయ్య

కొన వరకు అమిత ప్రేమతో చూచేవారు. వారి పదవి- ఇఫ్కో ఛైర్మన్; పి.యం.కు అత్యంత సన్నిహితుడు - వారితో పోలిస్తే నేను ఎక్కడా తూగలేను. కాని పెళ్ళకూరు లోని గొప్పతనం, తనకంటే తన మిత్రులు అన్ని విధాలా గొప్ప వారని! ఏదో పివి గారి కృప వల్ల ఛైర్మన్ అయినాను గాని, నాలో ఏముంది? అనే వారు.

రెండు నెలల క్రితం తనలోని మనోవేదన, బాధ వ్యక్తం చేశాడు. మన జిల్లాకు ఒక గొప్ప పరిశ్రమను తెచ్చి, వేల మందికి జీవనాధారం ఏర్పాటు చేస్తుంటే కొందరు అడ్డు పుల్లలు వేయడం నాకు కష్టంగా వుంది. ఈర్ష్య, అసూయలే ఇందుకు కారణం అని అన్నారు. నెల్లూరు జిల్లా రాజకీయాల్లో చాలా గడ్డు కాలంలో, నిరంకుశత్వం విలయ తాండవ మాడుతున్న రోజుల్లో పెళ్లకూరు రామచంద్రా రెడ్డి, నేను నెల్లూరు జిల్లా కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకులో డైరెక్టర్లుగా ఉండినాము. ఆయన ఆశయం, పట్టుదల, ఏకాగ్రత, చాలా మటుకు నాకు నచ్చాయి. అందువల్లే కలసి కట్టుగా పనిచేశాం.

పెళ్లకూరులో మరో గొప్ప పోషం ఉంది. తన మిత్రులతో మాట్లాడే టప్పుడు అప్యాయంగా కౌగలించు కొంటారు. ఏదో ముఖ్యమైన రహస్యం వారికి మాత్రమే చెప్తున్నట్లు; వారి మీద తనకు ఎంతో విశ్వాసం, నమ్మకం ఉండబట్టే ఆ రహస్యం వారితో పంచు కొంటున్నట్లు అభిప్రాయం కలిగించే వాడు.

మరి అటువంటి పెళ్లకూరును ఎలా మరచి పోగలం; కంట నీరు రాకుండా ఎట్లుంటుంది.

ఇక నుంచి ఢిల్లీకి పోతే ఆదరించే వారెవరు? అప్యాయతగా దగ్గర కూర్చొని, పంచ భక్ష్య పరమాన్నాలు నెల్లూరీయులకు ఎయిర్ కండిషన్డ్ డైనింగ్‌హాలులో వడ్డించే దెవరు? ఈ నెల్లూరు అతిథులు చాలా గొప్పవారు అని వారికి పరిచయం చేసేదెవరు? లేరు, లేరు ఉండబోరు!

## నార్వేయువతి

5పేజీ కొరవ

వ్యక్తులను దెబ్బతీయడానికి ఇంత విచ్చలవిడిగా, బహిరంగంగా, విశృంఖలంగా, బరితెగించి ప్రయత్నిస్తుంటే పోలీసు వ్యవస్థ, ప్రభుత్వ యంత్రాంగమూ నిస్సహాయంగా చూస్తూ వుండి పోవలసి రావడమే విచారించ దగిన విషయం. సిబిసిఐడి విచారణ ముగిసిన తరువాత, ఈ దృశ్యానికి కారకులైన వారి పై పరువు నష్టం దావా వేసే అవకాశం వుందేమో ఆస్పత్రి సిబ్బంది పరిశీలించడం మంచిది. ఒకటి రెండు సార్లు అటువంటి తీవ్ర చర్య చేపట్టినదే ఈ బ్లాక్ మెయిల్ ఆగదు.

* * *

అమెరికన్ బాప్టిస్టు సంఘం. ఎస్టీ బీసి వంటి సంస్థల వద్ద వెయ్యి కోట్ల రూపాయల విలువైన ఆస్తులున్నాయని డాక్టర్ దేవరాజ్ పూలా పేర్కొంటున్నారు. ఒక మత విభాగ సంస్థ ఆధీనంలో ఇంతటి విస్తృత సంపద కేంద్రీకృతమై వుండడం ఆశ్చర్య కరం. ఈ స్థిరాస్తులు కాక, వీరికి విదేశాల నుంచి వచ్చి పడే నిధులూ కోట్లలోనే వున్నాయి. వీటిని ఆజమాయిషీ చేసే స్వాతంత్ర్యం ప్రభుత్వానికి లేదు. కనీసం బిషప్ వంటి మత పెద్దలైనా ఆస్తుల అక్రమ అమ్మకాన్ని, నిధుల స్వాహాను నిలపకుంటే ఎట్లా? విచారణ జరపకుంటే ఎట్లా? మతం మీద ప్రేమతో, మత ప్రచారా శయంతో ఎవరో పూర్వీకులు సమకూర్చి పెట్టి వెళ్లిన విలువైన ఆస్తులు అదే మతం పేరుతో కొందరు వ్యక్తుల బొజ్జలు పెంచడానికి దుర్వినియోగం కావడం క్షంతవ్యం కాదు. బిషప్ గారూ - మీరీ విషయంలో నిస్సహాయులేనా?

* * *

డాక్టర్ పూలా గారు కాని, ఇతర ఆస్పత్రి సిబ్బంది కాని జాగ్రత్త గమనించ వలసిన ముఖ్య విషయం ఒకటి వుంది. అమెరికన్ ఆస్పత్రి ఒక సేవా సంస్థ. ఎంతో ఉదాత్త ఆశయంతో నెలకొల్పిన దేవాలయం. దాని నిర్వహణలో, దాన్ని నిర్వహించే వారిలో స్వచ్ఛత, సేవా దృక్పథం, త్యాగ నిరతి, అంకిత భావం కావాలి; నిర్వాహకుల వ్యక్తిత్వం కల్మషం లేని స్ఫటికం వలె వుండాలి; ఇంకొకరు వేలెత్తి చూపలేని ఆదర్శ ప్రాయమైన నైతిక పద్ధతిని అలవర్చుకోవాలి. అప్పుడే అటువంటి సంఘటనలు, దుష్ప్రచారాలు ఎదురైనప్పుడు జనం సానుభూతి లభిస్తుంది. అది లోపిస్తే, వ్యక్తిగత బలహీనతలకు, వ్యసనాలకు ఆస్పత్రిని వేదిక చేసుకొంటే తప్పు చేయక పోయినా చేశారన్న నమ్మకం జనంలో కలుగుతుంది. ఈ సంఘటనలో డాక్టర్ పూలాకు జనం మద్దతు లభించక పోవడానికి కారణ మదేనన్న సంగతి అర్థమయ్యే వుండాలి. ఈ నిజాన్ని వారు ఎంత త్వరగా గ్రహిస్తే వారి కంత మేలు.

* * *

అమెరికనాస్పత్రిని భ్రష్టు పట్టించి తమ ఆస్పత్రుల వ్యాపారం పెంచు కోవాలన్న కొందరు జనహితుల లక్ష్యం ఈ సంఘటనతో నెరవేరింది. ఆందోళన కారుల అఘాయిత్యాలకు, పోలీసుల రాక పోకలకు భయపడి రోగులు ఆస్పత్రి విడిచి పారిపోయారు. ఆ స్వస్థత కేంద్రం ఇప్పుడు నిరామయంగా కన్పడు తూంది. పోయిన పునరుద్ధ రించుకొని, తిరిగి ఆస్పత్రి పట్ల విశ్వాసం కల్గించ డానికి ఆస్పత్రి డాక్టర్లు, సిబ్బంది చాలా కష్టపడి పని చేయవలసి వుంటుంది.

* * *

ఈ కేసు విషయంలో జిల్లా ఎస్పి శ్రీ పూర్ణ చంద్రరావు ప్రవర్తించిన తీరు చాలా ప్రశంస నీయమైనది. ఒత్తిడులెన్ని వచ్చినా చలించ కుండా నిబ్బరంగా వ్యవహ రించారాయన. అట్లని ఆందోళన కారుల చేత మాటా పడలేదు. అధికారులు ఆ మాత్రం సంయమనం పాటించ గల్గితే పలు సమస్యలకు అవలీలగా పరిష్కారం లభిస్తుంది.



## జిల్లావార్తలు

5 పేజీ కొరవ

నేపథ్యంలో కాంగ్రెస్ గ్రూపుకు నాయకత్వం వహిస్తున్న గోవిందయ్య పై ఈ నెల 18 తేది తెలుగు దేశం పార్టీ వారు దాడి చేశారు. ఈ గొడవ తరువాతైనా ఎప్పుడూ నిద్ర మత్తులో జోగుతుండే అల్లూరు ఎస్ఐ బి.కె.ఎం. దాసు మేల్కొని తగిన జాగ్రత్తలు తీసుకొని వుంటే ఇంత మారణ కాండ జరిగి వుండేది కాదు. మైనార్టీ వర్గం తమ పై దాడి చేయడం సహించని మెజార్టీ కాంగ్రెస్ వర్గం 23 తేది ఎదురు దాడికి పాల్పడడంతో గ్రామంలో ప్రస్తుతం ఏ క్షణాన ఏమి జరుగు తుందో అర్థం కాని పరిస్థితి నెలకొని వుంది. ప్రస్తుతం గ్రామంలో శాంతిని నెలకొల్పడం అసాధ్యమే. కాని మాజీ ఎమ్మెల్యే విష్ణు వర్ధన రెడ్డి, ఇస్కపల్లి తెలుగు దేశం నాయకులు గట్టిగా కృషి చేస్తే ఈ మంటలు చల్లార్చవచ్చు. హింసను వ్యతిరేకించే విష్ణుకు ఈ సమస్యను భేదం కల్గించి పెట్టింది. ఇంత వరకు గ్రామస్తులను పరామర్శించను కూడా రాలేదు. ముత్తానికి వచ్చిన వేప తెచ్చిన పెన్నిధి చివరకు కుగ్రామస్తులకు అశాంతిని మిగిల్చింది.

## పన్నులు భోంచేసిన సిబ్బంది పై చర్య

గూడూరు మునిసిపల్ సమావేశం 25 తేది ఛైర్ పర్సన్ పి. సునీల్ కుమార్ అధ్యక్షతన జరిగింది. మునిసిపల్ సిబ్బంది ఇంటి పన్నుల వసూలు పేరుతో లక్షలాది రూపాయలను భోంచేసిన విషయమై కమీషనర్ సమాధానం చెప్పాలని కౌన్సిలర్లు సుబ్బరావమ్మ, వి.వి. రమణయ్య, షేక్ సలీం నిలదీశారు. 13 ఏళ్లుగా మునిసి పాలిటీలో ఆడిటింగ్ లేకుండడం ఏమిటంటూ; తక్షణం ఆడిటింగ్కు చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. దీనివల్ల సిబ్బంది ఇప్పటి వరకు ఎంత మొత్తం తినేశారన్న సంగతైనా బయట పడుతుందన్నారు. ఈ విషయమై కమీషనర్ ఓబులరెడ్డి వివరణ ఇస్తూ, ఇప్పటికే ఒక బిల్ కలెక్టర్ను ఈ విషయం పై సస్పెండ్ చేసి నట్లు చెప్పారు. మరి కొందరు సిబ్బంది లక్షలాది రూపాయలు భోంచేసి హాయిగా రిటైరై పోయారని, వీరి పై కూడా చర్య తీసుకొనేందుకు రంగం సిద్ధం చేస్తున్నట్లు చెప్పారు. ఛైర్మన్ చర్చలో జోక్యం చేసుకొంటూ ప్రజాధనాన్ని స్వాహా చేసిన వ్యక్తుల పై కఠిన చర్యలు తీసుకోవడానికి వెనుకాడనని చెప్పారు. ఛైర్మన్ కొత్త వాడు కావడంతో, నిబంధనలు తమకు అనుగుణంగా మలచుకొని కొంత మంది మునిసిపల్ సిబ్బంది పంది కొక్కుల్లా గూడూరు మునిసి పాలిటీని గుల్ల చేసేస్తున్నారు. పన్నులు భోం చేసిన విషయమై స్పష్టమైన ఆధారాలు లభిస్తున్నా వున్నతాధి కారులు ఎందుకు చర్య తీసుకోవడం లేదో అర్థం కావడం లేదు.

## గూడూరు ఎస్సి, ఎస్సి సొసైటీలో కుంభకోణం!

గూడూరు డివిజన్లోని షెడ్యూల్ కాస్ట్ సర్వీసెస్ కోఆపరేటివ్ సొసైటీ సబ్ డివిజన్ ఇంజనీరు కార్యాలయం అనేక అవక తవకలు. కుంభ కోణాలకు నెలవై విరాజిల్లుతూంది. 87లో కార్పొరేషన్ ఏర్పాటు చేసి నప్పటి నుంచి ఎన్నో పనులు ఫైనలైజ్ చేయక పడి వున్నాయి. కంట్రాక్టర్ల వద్ద వేల టన్నుల సిమెంటు, వందల టన్నుల స్టీలు నిలబడి పోయి వుంది. కంట్రాక్టర్లు ఫైనల్ బిల్ చేస్తే ఎక్కడ తిరిగి సిమెంటు, స్టీలు అప్పవలసి వస్తుందోనని బిల్లు తీసుకోవడం కూడా మాను కొన్నారట. నెల్లూరు జిల్లా ఎస్.సి., ఎస్సి సొసైటీకి కంట్రాక్టర్లు బాకీ వున్నంత మెటీరియల్స్ మరే జిల్లాలో లేరని విశ్వసనీయంగా తెలిసింది. సొసైటీలో పని చేసే ఇంజనీర్లు సొసైటీని గుంగ తీసేందుకు తమ వంతు చేయూత నందిస్తున్నారు. డిపార్టుమెంట్ ఎగ్జిక్యూషన్ పేరుతో జరుపుతున్న పనులలో అనేక అవక తవకలు ప్రత్యక్షంగా కనపడు తున్నాయి. చిట్టేడు ఎస్టి రెసిడెన్షియల్ స్కూల్, ఎస్టి డార్మిటరీ భవన పనులకు 12 లక్షల రూపాయల ఎస్టిమేట్లు తయారు చేసి తమకు అనుకూలమైన వారికే కట్ట బెట్టినట్లు తెలిసింది. దీనికి గాను భారీ మొత్తంలో ముడుపులు స్వీకరించినట్లు వినికిడి. ఇవే భవనాలకు గతంలో ఇ.ఇ.గా వున్న కె.వి. సుబ్బారెడ్డి డిపార్టుమెంట్ ఎగ్జిక్యూషన్ పేరుతో 75 శాతం నాటు కొయ్య వేసి టేకు కొయ్య క్రింద రికార్డు చేయించి లక్షల రూపాయలు మింగి వేసినట్లు తెలిసింది. నాయుడు పేట తుమ్మూరు డీలో ఘాట్లలో సర్వే రిపోర్టు లేకుండా బోర్లు వేర్లు వేయడంతో అవి విఫలమయ్యాయి. అయినా కాంట్రాక్టర్లకు బిల్లు చెల్లించారు. వెంకటగిరి రెసిడెన్షియల్ స్కూల్ స్టాఫ్ క్వార్టర్స్లో పూర్తిగా తగ్గు రకం కొయ్య వాడి టేకు వాడినట్లు బిల్లు చేసుకొన్నట్లు విమర్శలు వస్తున్నాయి. బాలికల డార్మిటరీ భవనానికి ఇసుక ఎక్కువ కలిపి ప్లాస్టరింగ్ చేయడం వల్ల ఈ భవనం నిర్మాణం పూర్తి చేసుకొని సంవత్సరం కాక మునుపే పగుళ్లు తీసింది. ఈ సొసైటీలో జరిగిన అవక తవకల విషయమై ఆఫీసు రికార్డుల[illegible] సీజ్ చేయించి సమగ్ర దర[illegible] చేయిస్తే గాని ఇంకా లోతు విషయాలు బైటపడవు.

## మద్యనిషేధానికి సహకరించండి

ప్రభుత్వ ఖజానాకు కోట్లాది రూపాయల నష్టం వస్తున్నా బలహీన వర్గాల సంక్షేమం కోసం ప్రభుత్వం నిషేధించిన సంపూర్ణ మద్య నిషేధాన్ని సరిగ్గా అమలు చేయడంలో ప్రజలందరూ సహకరించాలని కావలి డివిజన్ అబ్కారీ శాఖాధికారి టి. కృపానందం కోరారు. డివిజన్ పరిధిలోని చాకలి కొండలో ఏర్పాటు చేసిన మద్య నిషేధ ప్రచార సభకు అధ్యక్షత వహించి మాట్లాడారు. చాకలికొండ, సిద్ధన పాళెం, ఇస్కపాళెం, కుద్రు గ్రామాలను దత్తత తీసుకొని అక్కడ కాపు సారా తయారీ, మద్యం అక్రమ రవాణాలు అరి కట్టడానికి కృషి చేస్తున్నట్లు చెప్పారు. సాంఘికంగా ప్రజలు చైతన్య వంతమయితే మద్య నిషేధం తేలికగా అమలౌతుందని కావలి డివిజన్ పౌరసంబంధ అధికారి ఎం. వెంకటరత్నం చెప్పారు. వింజమూరు ఎమ్మార్వో శంకర రావు, ఉదయగిరి ఎక్సైజ్ సిఐ బాబా అలి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## కావలి షాప్ ఎంప్లాయిస్ కార్యవర్గం

కావలిలో వివిధ షాపుల్లో పనిచేసే 3 వేల మంది సభ్యులున్న ఎంప్లాయిస్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం పి. పాండు రంగా రావు అధ్యక్షతన ఇటీవల జరిగింది. ఈ సందర్భంగా నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షునిగా కె. రామ్మోహన రావు, ఉపాధ్యక్షునిగా పి. శ్రీనివాసులు, ఆర్గనైజింగ్ కార్యదర్శిగా వెంకట సుబ్బారావు, ప్రధాన కార్యదర్శిగా మునగా నాగిరెడ్డి, కార్యదర్శిగా వెంకట సుబ్బారావులను ఎన్నుకొన్నారు. వీరు గాక మరో 19 మందిని కార్యవర్గంలోకి తీసుకొన్నారు.

## కిసాన్ కాంగ్రెస్ నేతగా కళత్తూరు

సూళ్లూరుపేట మండలం కిసాన్ కాంగ్రెస్ కన్వీనర్గా కళత్తూ[illegible] మధుసూదన రెడ్డిని డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి నియమించారు. మంగా నెల్లూరుకు చెందిన మధుసూధన రెడ్డి మాజీ మంత్రి పసల పెంచలయ్య అనుచరుడు. నాయుడుపేట కిసాన్ కాంగ్రెస్ కన్వీనర్గా కామిరెడ్డి రుక్మండా రెడ్డిని నియమించారు.

## శివారెడ్డిపద్యాలు

### స్వర్గీయ పెళ్ళకూరు

పేదసాదలంటె ప్రేమ వాత్సల్యమ్ము
ఏమి శ్రద్ధ చదువు సాములంటె
కన్నుమూసినావ కదిలేవదివిరేపు
పెళ్ళకూరు తిరిగి మళ్ళీ రావ

ఉండదగిన వారు ఉంటుంది పోదగ్గ
వారు పోతె మనము వగవ [illegible]
కాలమృత్యువుల కళ్ళు చత్వారమ్ము
ఎల్లరొకటె పేద బిల్లమొకటె

## కీచులాట

(మొదటి పేజీ కొరవ)

[illegible] వారి పై కక్ష తీర్చుకునే కార్య[illegible]మంలో వై.ఎస్. నిమగ్నమై వున్నాడు. ఎలాగూ లోక్సభ ఎన్నికలు రానే వస్తున్నాయి. ప్రధాని నంద్యాలకు, కోట్ల కర్నూలుకు రాకపోతారా! తన తడాఖా చూపక పోతానా? అని వై.ఎస్. కాచుక్కూర్చున్నాడు. కర్నూలు లోక్సభకు ప్రస్తుతం కోట్ల తనయుడు సూర్య ప్రకాష్ రెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. వచ్చే లోక్సభ ఎన్నికల్లో కోట్ల కర్నూలు లోక్సభ నుండి పోటీ చేయడానికి రంగం సిద్ధం చేస్తున్నారు. కోట్ల లోక్సభలో గెలిస్తే ప్రస్తుతం తాను ప్రాతినిధ్యం వహిస్తున్న డోన్ అసెంబ్లీ నియోజక వర్గం నుంచి తన కుమారుడిని నిలబెట్టాలన్నది కోట్ల వారి కోరిక అయితే డోన్ అసెంబ్లీ నియోజక వర్గం నుంచి మాజీ మంత్రి కె.ఇ. కృష్ణమూర్తికి కాంగ్రెస్ టిక్కెట్ ఇప్పించి కోట్ల కోటకు చిల్లు పెట్టాలన్నది వై.ఎస్. ఆలోచన. ఒకవేళ సూర్యప్రకాష్ రెడ్డి డోన్లో పార్టీ టిక్కెట్ తెచ్చుకున్నప్పటికీ కె.ఇ.ను ప్రత్యర్థిగా రంగంలోకి నిలిపి కోట్లను పరాభవం పాలు చేయాలని వై.ఎస్. పట్టుదలగా వున్నారు. అలాగే కర్నూలు లోక్సభ ఎన్నికల్లో కూడా కె.ఇ. ప్రభృతుల సహకారంతో కోట్ల విజయావ కాశాలను దెబ్బతీయాలని వై.ఎస్. వ్యూహం పన్నుతున్నారు. ఇలా వుండగా కోట్లకు, నేదురుమల్లికి దగ్గరగా వుంటున్న పిసిసి అధ్యక్షుడు కె. రోశయ్య పై కూడా వై.ఎస్. తన అసమ్మతి అస్త్రాన్ని ప్రయోగిస్తున్నారు. ద్రోణంరాజు సత్యనారాయణను దువ్వి రోశయ్యకు ప్రత్యామ్నాయంగా తయారు చేస్తున్నారు. పేరుకు ప్రచార కార్యదర్శి అయినా అంతా ద్రోణంరాజు చేతుల్లో వుండాలని వై.ఎస్. తాపత్రయ పడుతున్నారు. ఇలా వుండగా వచ్చే లోక్సభ ఎన్నికల్లో వై.ఎస్.కు వ్యతిరేకంగా ఉమ్మడిగా పోరాడాలని నేదురుమల్లి, కోట్ల వర్గీయులు తమ అధి నాయకుల పై ఒత్తిడి తెస్తున్నారు. వై.ఎస్.ను కేవలం కడప వరకే పరిమితం చేసేందుకు అనుసరించాల్సిన వ్యూహాన్ని ఇప్పటి నుంచే అమలు చేయాలన్నది ఈ ఉభయ వర్గీయుల ఆలోచన.

# ముద్దుసీను లేకుండా కమల్ చిత్రం రాకూడదా?

చట్టం ఎన్ కైయిలె, ఉల్లాస పరవైగళ్, పున్నగి మన్నన్, దేవర్ మగన్, మహానది వగైరా చిత్రాలలో హీరోయిన్‌లను కమల్ చుంబించే దృశ్యాలున్నాయి. అవి ఆయన అభిమాన సంఘాల వారి కోర్కె మీద చొప్పించబడ్డాయి. ప్రతి చిత్రంలోనూ అటువంటి దృశ్యం ఒక్కటైనా తప్పక ఉండి తీరాలని కమల్ అభిమానుల వాంఛ. అట త్వరలో విడుదలయ్యే "ద్రోహి" చిత్రంలో కూడా ఈ సీను ఉండి తీరాలని అభిమానులు అడుగుతున్నారట. వాస్తవానికి గోవిందా నిహలాని సమకూర్చిన కథలో అటువంటి దృశ్యాలకు ఆస్కారమే లేదు. కాని, అభిమానుల అభీష్టం నెరవేర్చడానికి గౌతమిని, కమల్ చుంబించే దృశ్యమొకటి తప్పని సరి అయింది. షూటింగ్ సమయంలో దర్శకుడు, ఛాయాగ్రాహకుడు పి.సి. శ్రీరాం, అసి[illegible] అసిస్టెంట్లు తప్ప మిగతా అందర్నీ [illegible] బయటకు పంపించేసి, ఆ దృశ్యాన్ని చిత్రీకరించారు. "కాని, సినిమా చూసిన వారికి ఆ దృశ్యం కథకు ఎంత అవసరమో తెలుస్తుంది" అంటున్నారు కమల్.

### "మమ్మీ... మీ ఆయనొచ్చాడు"

తన తండ్రి ప్రవర్తన పట్ల విరక్తి కల్గిన కుమార రత్నం తన తల్లితో పై మాట అంటాడట. హీరో మందుభాయి. శోభనం గదిలో మందు కొట్టేసి మూడంకెలేసి పడుకొంటాడు. హీరోయిన్ మాత్రం రాత్రి శోభనం బాగా జరిగిందని అంటుంది. హీరోయిన్ అలా నాటక మాడడానికి కారణ మేమిటో తర్వాత కథ చెప్తుందట. కె. అజయ కుమార్ దర్శకత్వం వహించే "మమ్మీ... మీ ఆయనొచ్చాడు" చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, ఇంద్రజ, కీర్తన, కోట శ్రీనివాస రావు, ఎ.వి.ఎస్., కళ్లు చిదంబరం, వై.విజయ నటిస్తున్నారు. సంగీతం: విద్యాసాగర్.

### "సంప్రదాయం"

ఎస్.వి. కృష్ణారెడ్డి దర్శకత్వంలో కృష్ణ గ్రామీణ వాతావరణంలో జమీందారుగా నటిస్తుండగా, [illegible] మేఘన, నిర్మలమ్మ, మహేష్ ఆనంద్, వేణు మాధవ్, బ్రహ్మానందం, సాక్షి రంగారావు, తనికెళ్ళ భరణి, చలపతి రావు ఇతర పాత్రధారులు. మాటలు: దివాకర్ బాబు, కథ, స్క్రీన్‌ప్లే, సంగీతం, దర్శకత్వం: ఎస్.వి. కృష్ణారెడ్డి.

> మద్రాసు సినిమా వార్తలు

### "అబ్బ! ఏం మనుషులు"

అమెరికాలో వైద్యం [illegible] చేయించుకొని మన దేశానికి సురక్షితంగా [illegible] వచ్చిన శ్రీదేవి తన తల్లిని [illegible] పరామర్శించడానికి వచ్చే వారందరూ "[illegible] చికిత్స విషయంలో పొరపాటు జరిగి నందుకు నష్టపరిహారం ఎన్ని కోట్లు వసూలు చేశారేమిటి?" అని అడుగుతున్నారట. ఈ న్యూసెన్స్ భరించ లేక కొంత కాలం పాటు అందరికీ దూరంగా ఉండాలని శ్రీదేవి తలపోస్తుందట.

### "మా ఆవిడ కలెక్టర్"

"తాను సంపన్నురాలినని విర్రవీగుతూ పేద ప్రజల పై చిన్న చూపు కనబరిచే ఒక ధనవంతురాలిలో జగపతి బాబు పరివర్తన తెస్తాడు. భార్యాభర్తలు పరస్పరం అర్థం చేసుకుంటే మనస్పర్థలు వాటంతట అవే తొలగి పోతాయని తెలిపే ఇతివృత్తం" అన్నారు కోడి రామకృష్ణ. ఈయన దర్శకత్వం వహిస్తున్న "మా ఆవిడ కలెక్టర్" చిత్రంలో జగపతి బాబు, ప్రేమ, శుభశ్రీ, సుధాకర్, పోకల నరసింహా రావు, కాస్ట్యూమ్స్ కృష్ణ, అనంత్, ముక్కా నరసింగ రావు, విశ్వేశ్వర రావు, వై. విజయ, స్మిత, పూజిత, రమేష్, నెల్లూరు రమణా రెడ్డి పాత్రధారులు. సంగీతం: వందే మాతరం శ్రీనివాస్.

### "అమ్మోరు" నవంబర్ 10న

రమ్యకృష్ణ అమ్మోరుగా నటించిన మల్లెమాల శ్యామ ప్రసాద్ రెడ్డి నిర్మించిన చిత్రం ఎప్పుడో విడుదలవ వలసింది. ఎన్నో చేర్పులు, మార్పులతో నవంబర్ 10న విడుదల అవుతోంది. సురేష్, సౌందర్య, బాబూ మోహన్, రామిరెడ్డి, బేబీ సునయన నటించారు. మాటలు: సత్యానంద్, పాటలు: మల్లెమాల, సంగీతం: చక్రవర్తి, దర్శకత్వం: కోడి రామకృష్ణ.

### "బొబ్బిలి బుల్లోడు" టైటిల్ పై వ్యాఖ్యానం

"లోగడ బొబ్బిలి పేరుతో వచ్చిన చిత్రాలన్నీ సక్సెస్ అయ్యాయి. బొబ్బిలి పేరు థియేటర్ వరకు ప్రేక్షకుల్ని తీసుకు రావడానికి మంచి హెల్ప్ చేస్తుంది" అన్నారు బొబ్బిలి బుల్లోడు చిత్ర దర్శకుడు కె. రంగారావు. చిత్రంలో పస లేకపోయినా బొబ్బిలి అనే టైటిల్ థియేటర్‌కు ప్రేక్షకులు రావడం వరకు హెల్ప్ చేస్తే టిక్కెట్ కొనుక్కోవడానికి బుల్లోడు హెల్ప్ చేస్తాడా? డైరక్టరు, నిర్మాత జవాబివ్వ వలసిన ప్రశ్న ఇది.

వీరా చిత్రంలో రజనీకాంత్, మీనా

# జ్యోతిలక్ష్మి చేత డ్యాన్స్ చేయించారు!

"ముత్తు తమిళ సినిమాలో నటించమని అడగ డానికి ప్రొడక్షన్ మేనేజర్ వచ్చారు. ఆయన చెప్పిన తేదీలలో మా అమ్మాయి జ్యోతిమీనాకు వేరే చిత్రం కాల్ షీట్స్ ఉందని చెప్పాను. మీ అమ్మాయి కాదండీ, రజనీ కాంత్‌తో డాన్స్ చేయడానికి మీ కోసమే వచ్చా అన్నాడా ప్రొడక్షన్ మేనేజర్. నివ్వెర పోయాను; ఇంత వరకు నేను రజనీ కాంత్‌తో కలసి డాన్స్ చేయలేదు. అందుకని ఒప్పుకున్నాను. 60 ఏళ్ళ వృద్ధ స్త్రీలా కనిపించ డానికి నా తలకు గ్రే కలర్ విగ్గు పెట్టారు. సెట్‌లో రజనీ గారు నన్ను చూసి, వయసు మీరిన స్త్రీలా ఈమె కనిపించడం లేదే! అంటూ మేకప్ సామానులు తెప్పించి, నా ముఖం మీద ముడతలు కనిపించేటట్లు కొన్ని గీతలు గీశారు. అద్దంలో నా ముఖం చూసుకుంటే, చాలా ముసలి దానిగా కనిపించాను. అప్పుడు ఎం.జి.ఆర్. చెప్పిన ఒక విషయం గుర్తుకొచ్చింది. ఒక చిత్రంలో ఆయనతో పాటు నేను డాన్స్ చేస్తున్నాను. త్వరగా ముగించి ఇంటికి వెళ్లాలని డైరక్టర్‌ని కాస్త తొందర చేశాను. అప్పుడాయన - ఏవమ్మా నేడు ఈ స్థితికి రావడానికి ఆదిలో మేమంతా ఎంతో కష్టపడ్డాం. నువ్వు ఏ మాత్రం కష్ట పడకుండా సునాయాసంగా పైకొచ్చావు. అంచేత, నీకు అంతా తేలిక అయిపోయింది. మాకు మాత్రం త్వరగా షూటింగ్ ముగించుకొని ఇంటికి వెళ్లాలని ఉండదా? కాస్త ఓపిక ఉండాలమ్మా! అన్నారు. ఆనాటి నుంచే ఈ వృత్తిని

కొరవ 11 పేజీలో

# గౌతమిని రేప్ చేయలేక సుధాకర్ పడిన బాధ!

"ద్రోహి" చిత్రంలో శుభలేఖ సుధాకర్ చేత విలన్ వేషం వేయించారు కమల హాసన్. అదీ అమ్మాయిల పిచ్చి ఉన్న విలన్ పాత్ర. "అబ్బో! అటు వంటి వేషం నేను చచ్చినా వేయలేను" అన్నాడు సుధాకర్ మొదట్లో. "ఎందుకు వేయలేవు? నేను చేయిస్తా నువ్వు; చెప్పినట్లు వినాలంతే" అన్నాడు, కమలహాసన్. గౌతమి పై సుధాకర్ అత్యాచార యత్నం చేసే దృశ్యంలో సుధాకర్ మహా అవస్థ పడిపోయాడు. ఒకసారి గుడ్లు తేలవేసి, సెట్ బయటకు పరుగు తీశాడు కూడా. "అటువంటి వేషాలు నేను వేయలేను బాబోయ్!" అని కమల హాసన్ ఎదుట చెంపలు వేసుకున్నాడు. "పిచ్చోడా! అటువంటి అవకాశాలు ఎప్పుడో గాని రావు. ఆడదానిలా భయ పడతావేం! ఊ.. విజృంభించు భాయ్" అని సుధాకర్‌ను బలవంతంగా సెట్లోకి లాక్కెళ్లాడు కమల్. "తర్వాత నేను ఏం చేశానో ఏమో! డబ్బింగ్ చెప్పేటప్పుడు చూడడానికి థియేటర్‌లోకి వచ్చింది మా ఆవిడ శైలజ. మా ఇద్దరికీ 20.12.89 న బాల సుబ్రహ్మణ్యం వివాహం చేశారు. ఆ భయంకరమైన దృశ్యాన్ని చూసేసరికి మా ఆవిడ మండి పడుతుందనుకున్నా. కాని ఆవిడ అబ్బ! ఇంత కాలానికి ఒక వెరైటీ పాత్ర ధరించారండీ అని ప్రశాంతంగా అ[illegible]దిస్తూంటే, సుధాకర్ ఆమె [illegible] తెల్లబోయి చూస్తుండి పోయాడట!

# నటీనటుల కంటే జంతువులే బాగా నటించాయి

# అడవిదొర

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

పోసాని కృష్ణమురళి వ్రాసిన కథ చాలా పేలవంగా ఉంది. అడవుల నేపథ్యంతోను, అడవి జంతువుల అనుబంధంతోను కథ వ్రాయబడింది. పేలవంగా ఉన్న కథను రక్తి కట్టించేందుకు దర్శకుడు కె. సదాశివ రావు నానా తంటాలు పడ్డారు. కథకు చిల్లర, మల్లర విషయాలు చాలా జోడించారు. దేశంలోని పలు అడవులను చిత్రంలో చూపించారు. ఏనుగులు, ఎలుగు బంట్లు, కోతులు వగైరా జంతువులను చూపారు. ఒక పాటలో ఏనుగుల చేత నృత్యం చేయించారు. అడవి జంతువులను మితిమీరిన పద్ధతిలో చూపి ప్రేక్షకులను ఆకట్టుకోవాలను కున్నాడు.

ఇక ప్రేక్షకులను కొల్లగొట్టేందుకు శృంగారం వుండనే వుందిగా! ఇద్దరు హీరోయిన్లకు అవకాశం కలిగించి హీరో సరసన మోతాదుకు మించిన శృంగారంతో నృత్యాలు చేయించారు. ఫైట్లు లేనిదే తెలుగు చిత్రం అనిపించుకోదు కాబట్టి ఫైట్లు రెండింటినే చొప్పించారు. వినోదం లేకపోతే పాపం ప్రేక్షకులు విసుగెత్తి పోతారని వినోదం కొంత ఇరికించారు. [illegible] శ్రమ పడ్డా చిత్రం రక్తి [illegible]లేదు. ఈ అంశాలన్నీ చప్పుగా రూపు దాల్చటం వల్లే దర్శకుని కృషి నిష్ఫలమై పోయింది.

పోసాని కృష్ణ మురళి వ్రాసిన మాటలు చవక బారుగా వున్నాయి. వేటూరి వ్రాసిన పాటలో "నమో నమో నారాయణా" "పూలకుంట్లలోనె లావాదేవి మమ మమా" సాహిత్య పరంగా బాగున్నాయి. అయితే పాటలు కోటి సంగీతంలో రాణింపు పొంద లేక పోయాయి. పాటల దృశ్యాల చిత్రీకరణలో నాణ్యత కనిపించలేదు. కె.ఎస్. హరి కెమరా అడవి దృశ్యాలను రమణీయంగా రూపొందించింది.

శోభన్‌బాబు రెండు పాత్రలను పోషించారు. దినేష్ అనే ఫారెస్ట్ ఆఫీసరుగా, రాజేష్ అనే వ్యక్తిగా కనిపిస్తాడు. ఇద్దరూ ఒకే రూపుల్లో వుంటారు కాబట్టి, దినేష్‌ను ప్రేమించిన ఇద్దరు హీరోయిన్లు తబ్బిబ్బు లవుతారు. ఇద్దరు హీరోలు కలసి హీరోయిన్లను రథస పట్టిస్తారు. ఇది అసభ్యంగా కూడా తయారైంది. రెండు పాత్రలను శోభన్ బాబు చక్కగా పోషించాడు. హీరోయిన్లు సురభి, నగ్మా శృంగారానికి [illegible]మయ్యారు. ముళ్ళ జాకెట్టుతో కనిపించిన కామెడీ నటిగా జయలలిత ప్రత్యేకతతో కనిపించింది. బ్రహ్మానందం, అలీ హాస్యం అసభ్యంగా వుంది. పప్పు రుబ్బే దృశ్యం ఛండాలంగా వుంది. విలన్లుగా రామిరెడ్డి, సత్యనారాయణ, గిరిబాబు సాధారణంగా కనిపించారు. ఈ ముగ్గురు విల[illegible] [illegible] కంట్రాక్టర్లుగా వుంటూ కలప [illegible] చేస్తుంటారు. దినేష్ (శోభన్ బాబు) ఫారెస్ట్ ఆఫీసరుగా వస్తాడు. అతని రాకతో స్మగ్లర్ల ఆటకు అడ్డు తగులుతుంది. స్మగ్లర్లకు, దినేష్‌కు మధ్య ఘర్షణ రేగుతుంది. సు[illegible] [illegible] అమ్మాయి దినేష్‌ను ప్రేమిస్తుంది. ఇంతలో శిరీష అనే అమ్మాయి నాజూకుగా అక్కడికి [illegible] తను దినేష్‌ను ప్రేమిస్తుంది. కాని దినేష్ సురభిని పెళ్లి చేసుకో దలచాడు. పెళ్ళి సమయానికి దినేష్ స్మగ్లర్లతో గొడవ పడతాడు. స్మగ్లర్లకు దినేష్‌కు జరిగిన ఫైటింగులో దినేష్ ఒక పెద్ద లోయలో పడిపోతాడు. ఆ సమయంలో రాజేష్ (శోభన్ బాబు) అనే వ్యక్తి అక్కడి కొస్తాడు. రాజేష్, దినేష్‌లు ఒకే పోలికలతో వుంటారు. అందు వల్ల ప్రియురాళ్ళు యిద్దరూ రాజేష్‌ను

[illegible] 11 పేజీలో

## నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

### దగ్గుపాటి ప్రజా నాయకుడు కాదు

మార్కెటింగ్ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసాక రమేష్ రెడ్డి నెల్లూరు పాత్రికేయులతో తిరిగా మాట్లాడను 22 తేది లంచ్ ఏర్పాటు చేశారు. మంత్రిగా జిల్లాను ఎవరూ ఊహించని నంత అభివృద్ధి చేయాలన్నదే తన ఆశయమని రమేష్ రెడ్డి తన మనసులో మాట చెప్పారు. ప్రజారి మానం వల్లి పాముమ్మడైన తాను మంత్రి స్థాయికి ఎదిగినా పూర్వపు రోజులు మర్చిపోవన్నారు. లోటు పాట్లను పత్రికల్లో వ్రాసె ముందు స్వయంగా తనకు చెబితే వాటిని సరిదిద్దు కొంటా నన్నారాయన. జిల్లా మంచి మంత్రి అయ్యి పేరు ప్రఖ్యాతులు గడించిన స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డిని ఆదర్శంగా తీసుకొని పని చేస్తా నన్నారాయన. మంత్రి ఇంటికి అతిథిగా విచ్చేసిన రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి కడియం శ్రీహరి ఎమ్మెల్యే దగ్గుపాటి వెంకటేశ్వర రావు పై విమర్శల వర్షం కురిపించారు. చీలిక వర్గం వైస్రాయ్ హోటల్‌లో బస చేసి వున్నప్పుడు తాను ఉప ముఖ్యమంత్రి కావాలన్న కోరికను దగ్గుపాటి తన నోటితో చెప్పినట్లు చెప్పారు. ఆప్పుడు పదవి రాలేదని ఎన్టీఆర్ పంచన చేరారు. అసలు ఆయన ఏనాడూ ప్రజా నాయకుడు కాదు. స్వంత నియోజక వర్గంలోను తెలుగు దేశం పార్టీని గెలిపించు కోలేని సత్తా లేని వ్యక్తిగా అభివర్ణించా రాయన. చంద్రబాబు నాయుడిది నీతి వంతమైన ప్రభుత్వమని చెప్పేందుకు విద్యుత్ విధానం పై రభస రేగి రద్దు చేసిన ఎం.ఓ.యులను ఉదహరించారు. ఈ విషయమై కాంగ్రెస్ లెజిస్లేచర్ నాయకుడు పి. జనార్ధన రెడ్డి కూడా ప్రభుత్వాన్ని ప్రశంసించినట్లు చెప్పారాయన. చంద్రబాబు నాయకత్వంలో పనిచేసే ప్రభుత్వం 4 సంవత్సరాల పాటు అధికారంలో కొనసాగు తుందన్న ధీమాను మంత్రి వ్యక్త పరిచారు. సమావేశంలో సెకండరీ విద్యా శాఖ మంత్రి దురా ప్రసాద్ ఉదయగిరి, ఆత్మకూరు శాసన సభ్యులు కంభం విజయ రామిరెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడు పాల్గొన్నారు.

### కందుకూరు సబార్డినేట్ జడ్జి కోర్టులో

I.P. 12/1994

చిలకల పెద వెంకటస్వామి వగైరాలు
-పిటీషనర్లు

Vs

కురుముల లక్షుమమ్మ వగైరాలు
-రెస్పాండెంట్లు

రెస్పాండెంట్లు R2: కురుముల నర్సయ్య, తండ్రి తిమోతి, R4: కురుముల దావీదు తండ్రి తిమోతి. సాకిన్ పోలవరం గ్రామం, కనిగిరి రెవిన్యూ మండలం అనువారికి.

యీ నంబరున పిటీషనర్లు మీ వగైరాల మీద క్రెడిటార్ యిన్‌సాల్వెన్సి పిటీషన్ దాఖలు చేసినందులకు మీకు గల అక్షేపణల నిమిత్తం 20.11.95 తేదికి వాయిదా వేయబడి యున్నది. సదరు వాయిదా రోజు పగలు 10 గంటలకు పై కోర్టుకు హాజరై మీకు గల అక్షేపణలు తెల్పుకో వలసినది. లేని యెడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

కె. రామదాసు,
పిటీషనర్ల అడ్వకేటు, కందుకూరు

### అద్దంకి సబార్డినేట్ జడ్జి కోర్టులో

I.A. No. 456 of 93

O.S. No. 21 of 89

స్టేట్ బ్యాంక్ ఆఫ్ యిండియా, ఒంగోలు బ్రాంచి, రిప్రజెంటెడ్ బై యిట్స్ బ్రాంచి మేనేజరు
-పిటీషనరు/ వాది

రావిపాటి సదానంద రావు వగైరా
-రెస్పాండెంట్లు/ప్రతివాదు్లు

To, శ్రీ రావిపాటి సదానంద రావు

S/o. రాఘవులు

అనుబోలు వారి పాలెం గ్రామం

కొరిశపాడి మండలం, ప్రకాశం జిల్లా

పై నంబరున పిటీషనరు ప్రిలిమినరీ డిక్రీని బట్టి ఫైనల్ డిక్రీ పాస్ చేయ వలసినదిగా కోరి పిటీషన్ దాఖలు చేసినందున కోర్టు వారు మీ నోటీసు నిమిత్తము 3.11.95 తేదికి వాయిదా వేసి యున్నారు. మీకు అక్షేపణలున్న యెడల పై తేది ఉదయం 10.30 గంటలకు మీరు స్వయముగా గాని లేక వకీలు గారి ద్వారా గాని హాజరై తెల్పు కోవలసినది. లేని యెడల సదరు విషయమై మీ పరోక్షములో తీర్మానించ బడునని తెలియు జేయడ మైనది.

అద్దంకి రావినూతల హనుమంతరావు
6.10.95 పిటీషనరు తరఫు అడ్వకేటు

### మునిసిపాలిటీలు బడ్జెట్‌ను మించరాదు

పలు మునిసిపాలిటీలు బడ్జెట్ కేటాయింపులకు మించి పనులు చేయించి, అనవసరంగా ఆర్థిక సంక్షోభంలో పడి పోతున్నాయని మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ కమీషనర్ అజేంద్ర పాల్ అభిప్రాయ పడ్డారు. నెల్లూరులో జరిగిన ఒంగోలు, నెల్లూరు జిల్లాల పరిధిలోని మునిసిపల్ కమీషనర్ల సమావేశంలో పాల్గొని ప్రసంగించా రాయన. పారిశుధ్యం, పన్ను వసూళ్ల పట్ల మునిసి పాలిటీలు శ్రద్ధ వహించాలి. ప్రభుత్వ గ్రాంటులతో చేపట్టే అభివృద్ధి పనులు త్వరిత గతిన పూర్తి చేయాలన్నారు. ప్రతి మూడు నెలల కొకసారి ప్రత్యేక పారిశుద్ధ కార్యక్రమాన్ని మునిసిపల్ కమీషనర్లు రూపొందించు కోవాలని సలహా యిచ్చారాయన. మునిసిపల్ ఛైర్మన్ వివేకా నంద రెడ్డి కృషి ఫలితంగా నెల్లూరు మునిసి పాలిటీకి చిన్న మధ్య తరహా పట్టణ సమగ్ర అభివృద్ధి పథకం తాలూకు గ్రాంటు మంజూరైంది. ఈ పథకం ద్వారా 50 శాతం గ్రాంట్ ప్రభుత్వం ఇస్తుంది. మిగతా 50 శాతం మునిసి పాలిటీ భరించి టౌన్‌లో షాపింగ్ కాంప్లెక్స్‌లు నిర్మాణం, ఖాళీ స్థలాలు కొనుగోలు చేసి తగిన సౌకర్యాలు కల్పించి విక్రయించ వచ్చు. దీనివల్ల మునిసిపల్ ఆదాయం బాగా మెరుగు పడుతుంది. ఈ ప్రత్యేక సమావేశంలో మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ అదనపు డైరక్టర్ ఎస్. కృష్ణమూర్తి నాయుడు, రీజనల్ డైరక్టర్ వేమారెడ్డి, ప్రజారోగ్య శాఖ సూపరింటెండెంట్ ఇంజనీర్ మస్తాన్ నాయుడులతో పాటు నెల్లూరు, ప్రకాశం జిల్లాలలోని ఏడు మునిసి పాలిటీలకు చెందిన కమీషనర్లు పాల్గొన్నారు.

### రమేష్‌రెడ్డి వూరేగింపుకు వసూళ్లు చేయలేదు!

మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డి మద్దతు దారులైన నెల్లూరు మునిసిపల్ కౌన్సిలర్లు చాలా రోజులకు నిద్ర మత్తు వదిలించుకొని తమ నాయకుడ్ని నల్లపురెడ్డి రాజేంద్ర కుమార రెడ్డి విమర్శించటం పట్ల నిరసన తెలుపుతూ విలేకరుల సమావేశం ఏర్పాటు చేశారు. మంత్రి అయ్యాక నెల్లూరు వచ్చిన రమేష్ రెడ్డికి స్వాగతం చెపుతూ భారీ స్థాయిలో నిర్వహించిన ఊరేగింపుకు చిన్న బజారులోని దుకాణాల నుంచి డబ్బులు వసూలు చేయలేదని. లక్ష్మిపార్వతి కోటకు వచ్చినప్పుడు మాజీ మంత్రి ప్రసన్న కుమార రెడ్డే ఆ పని చేసినట్లు వారు చెప్పారు. రమేష్ రెడ్డి వెన్ను పోటు దారుడు కాడని, నల్లపురెడ్డి వంశీయులే వెన్ను పోటు దారులన్నారు. తమ సత్తాను కోవూరులో ప్రసన్న సభ ఏర్పాటు చేస్తే అక్కడ చాటుతా మన్నారు. ఉపాధ్యాయుల బదలీల్లో డబ్బులు తీసుకొన్న జడ్పీ ఛైర్మన్ నాగభూషణమ్మకు రమేష్ రెడ్డిని పల్లెత్తు మాటనే హక్కు లేదని వాదించారు. సమావేశంలో మునిసిపల్ వైస్ ఛైర్మన్ వి. దశరథ రామయ్య, కౌన్సిలర్లు డి. సుబ్బారావు, కె. ఈశ్వర రెడ్డి, ఎన్. బుజ్జయ్య, కె. విజయమ్మ, వై.వి. రామిరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### బ్రాందీ విస్కీల ధ్వంసం

ఎక్సైజ్ శాఖ పట్టుకొన్న దొంగ బ్రాందీ, విస్కీ, సారా సీసాలను 21 తేది సాయంత్రం ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలో జిల్లా జడ్జి ఎల్. అప్పారావు, అదనపు జడ్జి రామకృష్ణ, జ్యుడిషియల్ మేజిస్ట్రేట్లు జి. పుల్లారెడ్డి, వి. రాజేశ్వరి సమక్షంలో ధ్వంసం చేశారు. ఈ మద్యం ఖరీదు 8 లక్షల రూపాయలట. ఈ విధ్వంస కాండకు పిల్లలు ఆడుకొనే ఎసి స్టేడియంను వేదిక చేయడం పొరపాటు. ఈ స్టేడియంలోనే నిత్యం వందలాది మంది వాకింగ్‌కు వస్తుంటారు. మద్యం దుర్వాసన రెండు రోజులు స్టేడియంను విడలేదు. పగిలి సీసాలు, ఖాళీ ప్యాకెట్లు గందర గోళంగా పడి వుండానాయి. పగల గొట్టిన సీసాలను అమ్ముకోమని ఎక్సైజ్ శాఖ స్టేడియం అధికారులకు సలహా యిచ్చిందట. అందువల్లే ఆ చిన్న మొత్తానికి ఆశ పడి స్టేడియంను గబ్బు పట్టించారు. ఊరికి దూరంగా ఏ మైదానాన్నో ఎన్నుకొని వుంటే బాగుండేది.

### సినిమాల్లో అపహాస్యాన్ని ప్రేక్షకులు తిప్పికొట్టాలి!

నెల్లూరు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ రజతోత్సవ వేడుకలు 15 తేది ఇందిరా భవన్‌లో ఘనంగా జరిగాయి. ఎప్పుడూ లేని విధంగా వ్యాపారస్తులు కుటుంబ సమేతంగా తరలి రావడంతో జనంతో ఇందిరా భవన్ పట్టక పలువురు నిలబడాల్సి వచ్చింది. విద్యుత్ దీప ధగ ధగలు. మండపేట నుంచి ప్రత్యేకంగా విచ్చేసిన భగవాన్ వాఖ్యానం, సినీ నటుడు ఎవిఎస్, రచయిత వెన్నెలకంటి హాస్య వల్లరిని వ్యాపారస్తులు హాయిగా ఆస్వాదించారు. ఆంధ్రప్రదేశ్ ఫెడరేషన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షుడు వేలూరి దుర్వాసుల గుప్త, వ్యాపార ప్రముఖులు పి. బాల రాజయ్య, నెల్లూరు అసోసియేషన్ అధ్యక్ష, కార్యదర్శులు అచ్యుత సుబ్రహ్మణ్యం, ఎన్. కామేశ్వర రావు, సినీ హాస్య నటుడు ఎవిఎస్ వేదిక పై ఆశీనులయ్యారు. ఎప్పటిలానే దుర్వాసుల గుప్త పేరుకు తగ్గట్టే ఫింగరించి మాట్లాడారు. ఎంట్రీ, టర్నోవర్, వ్యాట్ టాక్సులతో అన్ని ప్రభుత్వాలూ వ్యాపారస్తులను వేధిస్తున్నాయి. వేధింపులు ఆపితే ప్రభుత్వానికి ఎంత టాక్స్ కట్టడానికైనా వ్యాపారస్తులు సిద్ధమే నన్నారు. జీత భత్యాలు లేని సమాజ సేవకులు వర్తకులని గుప్త అన్నప్పుడు మాత్రం సభలో పలువురు నవ్వు కోవడం కనిపించింది. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వ్యాపారస్తుల సమస్యలను అర్థం చేసుకొంటున్నారని, అటువంటి ప్రభుత్వం కోసమే వ్యాపారస్తుల సంఘాలు ఇన్నాళ్లు ఎదురు చూసినట్లు చెప్పారాయన. ఐక్యంగా వుంటే ఏ ప్రభుత్వాలూ ఏమి చేయలేవన్న విషయాన్ని వారు గ్రహించాలన్నారు. హాస్య నటుడు ఎవిఎస్ మాటలు, చేష్టలను ప్రేక్షకులు ఎంజాయి చేసాక, ఆయన సీరియస్‌గా మాట్లాడారు. సినిమాల్లో ఇటీవల అపహాస్యం ఎక్కువైనా, సెన్సార్ పుణ్యమో, ప్రేక్షకుల తిరుగుబాటు వల్లో అది చక్క బడిందన్నారు. ప్రవేట్ టివీ ఛానల్స్ వల్ల ఉత్తమ సినిమాలు తయారయ్యే అవకాశం ఎక్కువైం దంటూ, హాస్యం అపహాస్యం పాలైనప్పుడు ప్రేక్షకులే తిప్పి కొట్టాలన్నారు. నెల్లూరు నాటక రంగం అంటే ఒకప్పుడు పేరని, నేడది వెనుక బడడం బాధాకరమని. నెల్లూరీయుడ్ని కాకపోయినా ఒకప్పుడు నెల్లూరు పరిషత్తులో బహుమతి గెల్చుకు పోయిన నటునిగా పరిషత్తు పోటీలు పెడితే సహాయ పడతానన్నారు. కార్యదర్శి ఎన్. కామేశ్వర రావు సంఘం గత చరిత్ర, పాలక వర్గం చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు వివరించారు. సంఘ సభ్యుడు శేషయ్య గుప్త తొలుత స్వాగతం చెప్పగా, విమల్ జంక్షన్ అధినేత కోశాధికారి ఐ. వెంకటేశ్వర రావు చివరన వందన సమర్పణ చేశారు. వివిధ పోటీల్లో గెలుపొందిన వారికి సినీ నటుడు ఎవిఎస్ బహుమతి ప్రదానం చేసారు. లక్షల రూపాయల ఖర్చు పెట్టి కార్యక్రమం ఏర్పాటు చేసినా భోజనాల వద్ద రసాభస జరిగి రజతోత్సవ సభకు మచ్చ మిగిల్చింది.

### మాడరన్ స్కూల్ విద్యార్థి ప్రతిభ!

ఎపి సైన్స్ సెంటర్ హైదరాబాదులో 18తేది ఖగోళ శాస్త్రం పై రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన సైన్స్ క్విజ్‌లో నెల్లూరు మాడరన్ స్కూల్ విద్యార్థి శ్రీహర్ష రెడ్డి నాల్గవ స్థానం పొందాడు. 9 తరగతి చదువుతున్న శ్రీహర్ష రెడ్డి గతంలో జిల్లా స్థాయిలో నిర్వహించిన సైన్స్ క్విజ్‌లో ప్రథమునిగా నిలచినట్లు స్కూల్ అధినేత వి. విజయ కుమార రెడ్డి చెప్పారు.

### ఆకాశవాణిలో గోపాలరావు నాటిక

గిద్దలూరు గోపాల రావు బాల కార్మికుల సంక్షేమం మీద వ్రాసిన సూర్యోదయం నాటికను ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రసారం చేస్తుంది. నవంబరు 1, 8, 15 తేదీల్లో ఉదయం 7.15 నుంచి 7.45 వరకు ప్రసారమయ్యే నాటకాన్ని ఆసక్తి గలవారు వినవచ్చు.

### ముఖద్వార మండప ఆవిష్కరణ

సంతపేటలోని లక్ష్మి సమేత సత్యనారాయణ స్వామి మందిరంలో ముఖ ద్వార మండప ఆవిష్కరణ 2 తేది జరుగు తుంది. వ్యాస రాజ మఠ సంస్థానా ధీశులు విద్యా పయోనిధి తీర్థపాదులు తమ చేతుల మీదుగా ఆవిష్కరిస్తారు. ఈ సందర్భంగా 3 తేది సుదర్శన హోమం, 4 తేది సంపత్కర లక్ష్మి హోమం, 5 తేది కళ్యాణోత్సవం, 6 తేది ధాత్రి పూజ, 7 తేది కార్తీక దీపోత్సవ సేవ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ముఖ ద్వార మండపాన్ని ఎం. సత్యనారాయణ ఖర్చులు భరించి నిర్మించి నట్లు నిర్వాహకులు వి. శేషగిరి చెప్పారు.

## ప్రచార ప్రహసనం

4వ పేజీ కొరవ

లన్నారాయన. వృద్ధాప్య ఫించన్ల డబ్బు అర్హులకు అందకుండా వెను తిరిగి పోవడం శోచనీయ మన్నారు. ఈ బృహత్తర కార్యక్రమానికి జిల్లా అధికారులు, సిబ్బంది సహకార మందించాలని కోరారాయన. ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయ రామిరెడ్డి మాట్లాడుతూ ప్రజల ముందుకు ప్రభుత్వాన్ని తీసుకెళ్లడం సంతోషం, కాని నియోజక వర్గంలో ప్రభుత్వాధి కారులే వుండరు; ఏ శాఖకు ఎవరు అధికారి అనేది తనకే ఇంతవరకు తెలియదని ఇక ప్రజలకు ఏ విధంగా తెలుస్తుందని ప్రశ్నించారు. సర్వేపల్లి ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి వి.ఏ.ఒ. ల పై తన అక్కసు వెళ్ల గక్కారు. అల్లూరు ఎమ్మెల్యే జక్కా వెంకయ్య ముందుగా గ్రామాల్లో వీధి లైట్లు, రోడ్లు, తాగు నీరు, డ్రైనేజి వసతి వంటి సౌకర్యాలు కల్పించాలని కోరారు. ఆత్మకూరు ఎమ్మెల్యే లక్ష్మయ్య నాయుడు కూడా వి.ఎ.ఓ.లు గ్రామాల్లో వర్గాలను రెచ్చ గొడుతున్నట్లు చెప్పారు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

ఎంత అంబేదైనా పెళ్లాం తన కండ్ల యెదుట వ్యభచరిస్తుంటే ఒక వేళగాకుంటే ఒక వేళైనా బ్రతికి వున్న పురుషుని రక్తం ఉడుకెక్కదా?

మొత్తానికి ఆవేశంతో చేసిన ఆ కార్యం - కేసు యింకా పోలీసు దర్యాప్తులో వుంది.

**అధికార వర్గం**

కావలి నోట్ల కేసు విచారించిన మొహిద్దీన్ ఖాన్ గారిని చేతులు కడుక్కుం టుండగానే గుంటూరు డిప్టి కలెక్టరుగా నియమించారు.

**చిత్రాంగి**

గురుపాటి వారి చిత్రాంగిని నెల్లూరు యువకులు 19 తేది ప్రదర్శించారు. నటకులు ప్రోత్సహించ వలసిన వారు పరిశ్రమ చేస్తే యింకా ముందుకు రాగలరు.

-విమర్శకుడు

## జనవాణి

3వ పేజీ తరువాయి

ప్రసారం చేస్తున్నది. పెద్ద ఆఫర్‌గా ఒక ... కోటి రూపాయల టెండర్ పాడించింది. ప్రసార మంత్రిత్వ శాఖకు అనుబంధమైన దూరదర్శన్ లోకసభ, రాజ్యసభల ప్రశ్నోత్తర కార్యక్రమాన్ని అప్పటికే ప్రసారం చేస్తుంది. మరి ఈ ఆఫర్‌ను ఎందుకు తిరస్కరించిందో అర్థం కావడం లేదు.

హైదరాబాద్ -ఎం నరసింహా రావు

### ఎంప్లాయిమెంటు ఆఫీసులో అవకతవకలు!

నెల్లూరు ఎంప్లాయిమెంటు ఆఫీసులో కల్పించిన కంప్యూటర్ సౌకర్యం నిరుద్యోగుల పాలిట శాపమైంది. కొత్తగా రిజిస్ట్రేషన్, రెన్యువల్, అదనపు అర్హతలు నమోదు చేసేందుకు ప్రత్యేకంగా ఒక దరఖాస్తు ఫారంను ఆఫీసుకు వెళ్లిన తర్వాత పూర్తి చేసి ఇవ్వాలి. కాని ఆఫీసులో వున్న సిబ్బంది ఈ విషయాలను కంప్యూటర్‌లో ఫీడ్ చేసేటప్పుడు పేరు, ఇంటి పేరు, తండ్రి పేరు, పుట్టిన తేదీ, కులం, వివాహితులా కాదా వంటి అంశాలు తప్పుగా నమోదు చేస్తున్నారు. తప్పుల విషయం అడిగితే ఏదో ఒక సాకు చెబుతున్నారు. చాలా మంది తప్పులను చూసుకోక రిజిస్ట్రేషన్ పత్రాలను ఇళ్లకు తీసుకెళ్ళి తర్వాత ఇబ్బంది పడుతున్నారు. అది గాక టౌన్ చివర ఆఫీసు వుండడంపలువురికి సమస్యగా మారింది. జిల్లా కలెక్టర్ ఈ విషయంలో జోక్యం చేసుకొని ఎంప్లాయిమెంట్ ఆఫీసులో సిబ్బంది కంప్యూటర్ రిజిస్ట్రేషన్ ఫారంను రెండవ సారి చెకింగ్ చేసేలా ఆదేశాలు జారీ చేయాలి. ఎంప్లాయి మెంట్ కార్యాలయాన్ని అందరికీ అందుబాటులో వుండే చోటుకు తరలించేలా చర్యలు తీసుకోవాలని మనవి.

నెల్లూరు -నీళ్ళ వెంకయ్య

### ఎన్టీఆర్ సినిమా గ్లామర్ ఇంకా పనిచేస్తున్నది

ఎన్టీ రామారావు పదవీచ్యుతుడు గావడానికి కారణం అతని స్వయం కృతాప రాధమేనని అందరికీ తెలుసు. అంత పెద్ద కుటుంబం వుండి కూడా లక్ష్మి పార్వతిని పెండ్లాడడం సహించరాని విషయం. పరిచర్యలు చేసే వారు లేక వివాహం చేసుకోవడం జరిగిందని చెప్పి, ఆమెను సరాసరి రాజకీయాల్లోకి దించడం ఇంకా అపచారం. లక్ష్మిపార్వతి గూర్చి ప్రజలు, రాజకీయ కార్యకర్తలు ఎన్ని చెప్పినా వినలేదాయన. చివరికి ఆ పొరపాటుతో ప్రభుత్వం చేతులు మారింది. నెల రోజుల ఏకాంతం తరువాత ఎన్టీఆర్ ఇంటి వద్ద మళ్లీ సందడి మొదలైంది. కిటిలు, చప్పట్లు ప్రారంభ మయ్యాయి. ఆయన పదవీ కాలంలో ప్రజలకు ఒరగ పెట్టింది ఏమీ లేదు. కానీ సామాన్య ప్రజల్లో మాత్రం పూర్వం ఎన్టీఆర్‌కు వున్న సినిమా గ్లామర్ ఇంకా చెక్కు చెదర లేదనిపిస్తుంది.

కోవూరు

### గ్రామీణులంటే విద్యుత్‌శాఖకు చులకనా?

అక్టోబర్ 11 తేది నుండి గృహ అవసరాల విద్యుత్ పై కోత ఎత్తి వేస్తున్నట్లు ముఖ్య మంత్రి ప్రకటించారు. కాని విద్యుత్ శాఖ అధికారులు మాత్రం పట్టణ ప్రాంతాల్లో కోతను ఎత్తివేసి, గ్రామీణ ప్రాంతాల్లో పాత పద్ధతినే అనుసరిస్తున్నారు. గ్రామాలే దేశానికి పట్టు కొమ్మలన్న గాంధీజీ ... న్ని నేటి తరం నాయకులు మరచి పోయినట్లున్నారు. గ్రామీణ ప్రాంతాల నుంచి శాసన సభ్యులుగా గెలిచిన వారు ఈ విషయమై ప్రజలకు సమాధానం చెప్పి తీరాలి. గ్రామీణ ప్రజలు కట్టే విద్యుత్ ఛార్జీలతో జీతాలు తీసుకొనే విద్యుత్ శాఖ గ్రామాల పట్ల ... వైఖరం విడనాడాలి.

జనమునుగు ...

### ఇఫ్కో పై ప్రభుత్వాలు ప్రకటన చేయాలి

ఇఫ్కో ఛైర్మన్ పెల్లకూరు రామచంద్రా రెడ్డి పట్టుదల, కృషి వల్ల రాచర్ల పాడు వద్ద ఎరువుల కర్మాగారం మంజూరైంది. కాని కర్మాగారానికి శంకుస్థాపన చేయక ముందే ఆయన మరణించడం జిల్లా ప్రజలను తీవ్ర మనస్తాపానికి గురి చేసింది. ప్రస్తుతం కర్మాగారం నిర్మాణం జరుగుతుందా? లేదా? అని ప్రజలు ఆందోళన చెందుతున్నారు. ఈ విషయమై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒక ప్రకటన చేయాలి.

నెల్లూరు -షేక్ గౌస్‌మొహియుద్దీన్

## సినిమా

9వ పేజీ తరువాయి

సీరియస్‌గా తీసుకోవడం మొదలెట్టాను. మా అమ్మాయికి అదే బోధిస్తున్నాను" అంది జ్యోతిలక్ష్మి.

### ఎ.ఎన్.ఆర్, జయసుధల చిత్రం

ముప్పలనేని శివ దర్శకత్వం వహించే సుజాతా ఆర్ట్ ... చిత్రంలో ఎ.ఎన్.ఆర్, జయసుధ, శ్రీకాంత్, మోనికా బేడి, రాజ్ కుమార్, బ్రహ్మానందం, తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్, సుధాకర్ పాత్రధారులు.

### వంశానికొక్కడు

"తండ్రి ... స్పిన్నింగ్ మిల్స్‌లో కార్మికులకు అన్యాయం చేస్తుంటే, కార్మికుల వైపు ప్రతినిధిగా తండ్రినే నిలదీస్తాడు కొడుకు. వంశానికి వన్నె తెచ్చే రాజా పాత్రలో బాలకృష్ణ చక్కగా నటించాడు" అన్నారు డైరెక్టర్ శరత్. ... ఆమని, మధురిమ, రాణి ముఖ్య ... నటించారు. "పతాక సన్నివేశాలను, మూడు పాటలను ఈ నెలలోనే ముగిస్తాం" అన్నారు నిర్మాత శ్రీమతి అనితా కృష్ణ.

### సుమన్ చిత్రాలు

ముత్యాల సుబ్బయ్య దర్శకత్వం వహించే చిత్రంలో హీరా, సంఘవి నాయికలు. బాపు దర్శకత్వంలో ... పూర్ణ ... చిత్ర నిర్మించే చిత్రంలో సుమన్ ... వ్యపాత్రాభినయం విశేష ... గుహనాథన్ దర్శకత్వంలో ఎ.వి.ఎ. సంస్థ నిర్మించే చిత్రంలో; శరత్ దర్శకత్వంలో అంజిరెడ్డి నిర్మించే చిత్రంలో సుమన్ హీరో.

## చిత్రసమీక్ష

9వ పేజీ తరువాయి

దినేష్‌గా అనుకుంటారు. ఇక ఆయనతో ఇద్దరి సరసాలు సాగుతాయి. దినేష్ బ్రతికి వస్తాడు. దినేష్, రాజేష్‌లు కలిసి స్మగ్లర్ల ఆట గట్టిస్తారు.

ఈ కథలో ఏ పాత్రా సరిగ్గా ఎదగ లేదు. సత్యనారాయణ, రామిరెడ్డి, గిరిబాబు, బ్రహ్మానందం వారి పాత్రల్లో బలై పోయారు. ఇక నగ్మా, సురభి విషయం చెప్పనవసరం లేదు. మనుషుల పాత్రల కంటే జంతువుల పాత్రలు ఇంపుగా వున్నాయి.

# శ్రద్ధాంజలి



మాకత్యంత ఆప్తుడు,
ఎంతో అండగా వుండిన

## పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారు

స్వర్గస్తులైనందుకు చింతిస్తూ, వారికి
మా ప్రగాఢ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

వారి కుటుంబానికి
మా సానుభూతిని తెలుపుకొనుచున్నాము.

కొల్లి బ్రదర్స్
నయాగరా - నెల్లూరు

... Paper Products (I) Ltd.